# ఆంధ్రనాట్యం

## సిలబసు – వ్యాఖ్యానం



రచన

**డా॥ నటరాజ రామకృష్ణ**

**పేరిణి ఇంటర్నేషనల్**

అశోక్‌నగర్, హైదరాబాదు - 20

# ఆంధ్రనాట్యం

## సిలబసు – వ్యాఖ్యానం



రచన
డాక్టర్ నటరాజ రామకృష్ణ

పేరిణి ఇంటర్‌నేషనల్
అశోక్‌నగర్, హైదరాబాద్ - 20

# ఆంధ్రనాట్యం

## సిలబసు – వ్యాఖ్యానం

*With Best Compliments From :*
PADMA SRI NATARAJ RAMAKRISHNA
Andhra Natyam Trust
Chikkadpally, Hyderabad-500 020.


రచన

**డాక్టర్ నటరాజ రామకృష్ణ**



**పేరిణి ఇంటర్‌నేషనల్**

అశోక్‌నగర్, హైదరాబాద్ - 20

# ఆంధ్ర నాట్యం

ఆంధ్రప్రదేశ్ 1956లో అవతరించింది. తర్వాత ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ ఏర్పాటయింది. అకాడమీ తొలి అధ్యక్షులైన శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి హయాంలో కూచిపూడి సదస్సు జరిగింది. అనాటినుండి ఆ కళ అభివృద్ధి చెంది, విశేష ప్రచారం పొందింది.

తర్వాత శ్రీ పసల సూర్యచంద్రరావుగారు అధ్యక్షులుగా ఉన్నప్పుడు అభినయ సదస్సు రాజమహేంద్రవరంలో జరిగింది. ఆ సదస్సులో ఆంధ్రుల ప్రాచీన లాస్యనర్తనానికి 'ఆంధ్రనాట్యం' అన్నపేరును ఆనాడు సమావేశమైన వృద్ధస్త్రీ కళావేత్తలు పెట్టారు. ఆ తర్వాత ఆ నాట్యరీతికి ఒక సిలబసు వ్రాయబడింది. నృత్య అకాడమీ ప్రత్యేకంగా ఏర్పాటయిన నాటికి ఆ సదస్సులో పాల్గొన్న వృద్ధ కళాకారులలో చాలమంది గతించారు. ఈ సదస్సు ప్రధాన కారకురాలైన భరత కళాప్రపూర్ణ శ్రీమతి అన్నాబత్తుల బులివేంకటరత్నమ్మ గారు కూడా మరణించారు. భరతకళా ప్రపూర్ణ శ్రీ కోరాడ నరసింహారావుగారి అధ్యక్షతన కొన్ని మార్పులతో ఒక సిలబసును ఆంధ్ర నాట్యానికి నృత్య అకాడమీ వారు తయారు చేయించారు. ఆ సిలబసును తయారు చేయడంలో శ్రీమతి జంపా ముత్యం (విజయనగర సంస్థానం), శ్రీమతి దుగ్గిరాల జగదాంబ (మండపేట), శ్రీమతి సరిదె మాణిక్యం (బల్లిపాడు దేవాలయం)గార్లు సహకరించారు. వీరు ముగ్గురు ఆంధ్రనాట్యాన్ని మూడు పద్ధతుల్లో ఆరాధించారు. ఆ సిలబసును 1982 లో ఆం. ప్ర. నృత్య అకాడమీ వారు ఆమోదించారు. 1970 లో వృద్ధ కళాకారులు ఆంధ్రుల లాస్యనర్తనానికి పెట్టిన "ఆంధ్రనాట్యం" అన్న పేరును గూడ నృత్య అకాడమీ ఆమోదించింది. ఈ కళా ప్రచార నిమిత్తం నృత్య అకాడమీ కొన్ని ముఖ్య నిర్ణయాలు తీసికొంది.

ఈ యాంధ్రనాట్యం మూడువిధాలుగా అభివృద్ధి చెందింది. 1. ఆలయాల లోని దైవపూజలోని కొంత భాగం, 2. దేవుని కొలువులో, పండితుల సమక్షంలో, రాజుల ఆస్థానాలలో ప్రదర్శింపబడిన కేళికారీతి, 3. సామాన్య ప్రజలకోసం ఆలయం వెలుపల రథమువద్ద ప్రదర్శింపబడుచుండిన పారిజాతాలు,

కళాపాలు. ప్రస్తుతం ఈ మూడు భాగాలను కలిపి ఒకటిగా ప్రదర్శించదగ్గ రీతిలో మేము కూర్చి ప్రదర్శిస్తున్నాం. ఆరాధన రీతిలో ప్రదర్శనను ప్రారంభించి, పారిజాత రీతితో ముగిస్తున్నాం. తర్వాత ఆంధ్ర ప్రభుత్వం అకాడమీలను రద్దు చేసి, తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం చేశారు. ఆ తర్వాత డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు తెలుగు విశ్వవిద్యాలయ వైస్ చాన్స్లర్‌గా, శ్రీ ఎల్లా వేంకటేశ్వరరావుగారు డీన్‌గా ఉండినప్పుడు ఒక ప్రత్యేక సిలబస్ కమిటీ ఏర్పాటయింది. అందులో డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావు, ప్రొఫెసర్ నాగభూషణ శర్మ, డాక్టర్ నటరాజ రామకృష్ణ, ఉమా రామారావు, కళాకృష్ణ, పేరిణి రమేష్ సభ్యులుగా ఉండి మరొక సిలబస్‌ను ఆంధ్ర నాట్యానికి తయారు చేసి ఇచ్చారు. ప్రభుత్వం ఆంధ్రనాట్యానికి గుర్తింపు నిచ్చి, హైదరాబాదు సంగీత నృత్య కళాశాలలో ఈ సిలబస్ ప్రకారం తరగతులను నిర్వహించుటకు, ప్రైవేటుగా యువ కళాకారులు ఈ పరీక్షలకు వెళ్ళడానికి అనుమతిస్తూ ఉత్తరువును జారీ చేసింది. ఈ యుత్తరువు మాకు 1995 రిపబ్లిక్‌డేనాడు అందింది.

1970 నుండి మేం విశాఖ, కాకినాడ, రాజమండ్రి, ఒంగోలు, గుంటూరు, సత్తెనపల్లి, విష్ణుపురం, దాచేపల్లి, విజయవాడలో (మూడు), గోదావరిఖని, కరీంనగర్, నిజామాబాద్, ఆర్మూర్, వేములవాడ, సిరిసిల్ల, బోధన్, సిద్దిపేట, కర్నూలు, సూర్యాపేట, మిరియాలగూడ, జహీరాబాద్, ముమ్మడివరం, హైదరాబాద్‌లో (నాలుగు) సంస్థలు నెలకొల్పి, వందలాది బాలబాలికలకు ఆంధ్రనాట్యం నేర్పుతూ వస్తున్నాం. మలక్‌పేటలోని సేంట్ డోమనిక్ స్కూల్లో ఒక పెద్ద నృత్య సంస్థను ఏర్పాటు చేశాం. 1994 లో రెండు సదస్సులను 'ఆంధ్రనాట్యం' పైని విజయవాడలో శ్రీమతి శారదా రామకృష్ణ, హైదరాబాదు సెంటు డోమనిక్సు నటరాజ రామకృష్ణ ఆంధ్రనాట్యం, పేరిణి రిసెర్చి ఫౌండేషను వారు నిర్వహించారు. ఔరంగాబాద్, పూనా నగరాలలోనే కాక అమెరికాలో మూడు ఆంధ్రనాట్య సంస్థలను నిర్వహిస్తున్నాం.

హైదరాబాదు-20 — నటరాజ రామకృష్ణ

1-3-95

# ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500 004

## 16-9-82 న జరిగిన కార్యవర్గ సమావేశపు ప్రొసీడింగ్సు :

**హాజరైన సభ్యులు :**

1. డా. నటరాజ రామకృష్ణ - అధ్యక్షులు
2. శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ - ఉపాధ్యక్షులు
3. శ్రీ పి. పార్థసారధి - కార్యదర్శి మరియు కోశాధికారి
4. ప్రొ. బి. రామరాజు
5. శ్రీమతి సుమతీ కౌశల్
6. శ్రీ కోరాడ నరసింహారావు
7. కుమారి వి. సీతాదేవి
8. శ్రీ ఓ పి. గోయంక
9. శ్రీమతి చింతా చిన గనిరాజు
10. శ్రీ గరిమెళ్ళ రామమూర్తి - ప్రత్యేక ఆహ్వానితులు.

**అంశం (9) :** భరతనాట్యము (ఆంధ్ర శాస్త్రీయ పద్ధతి)కు సిలబసు వ్రాయుట గురించి :

భరతనాట్యము (ఆంధ్ర శాస్త్రీయ పద్ధతి)కు సిలబసు వ్రాసే నిమిత్తమై కార్యవర్గము నియమించిన కమిటీయొక్క నివేదికలను (అనుబంధములు - 4, 5, 6) కార్యవర్గం ఆమోదనకై వుంచడమైనది.

**తీర్మానములు (1) :** కమిటీ సమర్పించిన సిలబసును, దానికి వివరణలతో తయారుచేసిన నోట్సును కార్యవర్గం ఆమోదించినది.

(2) ఆంధ్రదేశంలో స్త్రీలచే ప్రదర్శించు లాస్య నర్తనమునకు "ఆంధ్ర నాట్యము"గా నామకరణము చేయుటకు కార్యవర్గము నిర్ణయించినది. కూచిపూడి సాంప్రదాయ రీతి కాకుండా యీ ఆంధ్ర నాట్యము ప్రత్యేకమైన నృత్య ప్రక్రియగా కార్యవర్గము గుర్తించినది.

(3) ''ఆంధ్ర నాట్యము''పై వివిధ అంశాలపైన చర్చించుటకుగాను ఒక సదస్సును ఏర్పాటు చేయుటకు నిర్ణయించడమైనది.

(4) పై నృత్య ప్రక్రియకు తయారుచేసిన నిలబను ననుసరించి 10 మంది కళాకారులకు (కొంతవరకు భరతనాట్యములో, కూచిపూడి నాట్యములో ప్రావీణ్యము కలిగినవారికి) నాలుగు నెలలపాటు ప్రత్యేక శిక్షణా తరగతులను ఏర్పాటు చేయుటకును యీ శిక్షణకు, యీ సాంప్రదాయము ఎరిగిన వృద్ధ కళాకారులను రప్పించి, వారి యొక్క సంపూర్ణ సహకారంతో తీర్చిదిద్దుటకును, అట్లు విద్య నభ్యసించిన విద్యార్థులతో ఆంధ్రదేశములోని ప్రముఖ పట్టణాలలోను భారతదేశములోని వివిధ రాష్ట్రాలలోను, అటుపై విదేశములలోను ప్రదర్శనలు ఇప్పించుటకుగాను నిర్ణయించడమైనది.

(5) పై నృత్య ప్రక్రియలో సహకార గానం చేయుటకు గాత్రం పాడే వారికి, మార్దంగికులకు శిక్షణ యిచ్చి తయారుచేయుటకు నిర్ణయించడమైనది.

(6) ఈ నాట్యక్రమము ననుసరించి కొందరు కళాకారులకు ఉపాధ్యాయులుగా శిక్షణ యిచ్చుటకు కూడ నిర్ణయించడమైనది.

(7) ఈ నాట్యక్రమము ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాలలందు శిక్షణ యిప్పించుటకుగాను ప్రభుత్వమువారిని కోరుటకు నిర్ణయించడమైనది.

(8) ఈ నృత్య సాంప్రదాయము గురించి పత్రికల ద్వారా బహుళ ప్రచారం జరిపించుటకు నిర్ణయించడమైనది.

(9) కేంద్ర సంగీత, నాటక అకాడమీ, కేంద్ర ప్రభుత్వము ద్వారా ఈ పా చీన శాస్త్రీయ నృత్యానికి తగు ప్రోత్సాహం లభించుటకు అకాడమీ కృషి చేయుటకుగాను నిర్ణయించడమైనది.

(10) భారత ప్రభుత్వంవారు ప్రతి సంవత్సరము కళాకారులకు యిచే స్కాలర్‌షిప్‌లు ఈ సాంప్రదాయము నభ్యసించేవారికికూడ యిప్పించే నిమిత్తమై ఆకాడమి కృషి చేయుటకుగాను నిర్ణయించడమైనది.

సం॥ నటరాజ రామకృష్ణ
గౌ. అధ్యక్షులు

సం॥ సి. పార్థసారథి
గౌ. కార్యదర్శి

# Government of Andhra Pradesh
## ABSTRACT

CULTURAL AFFAIRS - Introduction of "Andhra Natyam" Dance Discipline in Sri Tyagaraya Government College of Music and Dance, Hyderabad - Orders Issued.

TOURISM CULTURE SPORTS AND
YOUTH SERVICES (CA II) DEPARTMENT

G.O.Ms. No. 7, Dt. : 23-1-1995

Read the following :-

1. From the D.C.A., Lr.No. B4/359/91-2, dt. 31-8-91.
2. From the D C A., Lr.No. B3/359/91-5, dt. 17-11-94.

**ORDER :**

Numerous representations have been received for introduction of "Andhra Natyam" the ancient temple dance in the Government Music and Dance Institutions The Telugu University has prepared and approved the Syllabus for "Andhra Natyam" and requested for permission to conduct examinations in that discipline along with other disciplines. The Telugu University had also requested for permission to allow private students to appear for examinations in that discipline through Government Music & Dance Institutions without any financial involvement for the Government.

2. The Director of Cultural Affairs, in his reference second read above sought for permission to introduce "Andhra Natyam" in S.T. Government College of Music & Dance,

Hyderabad in the first instance and also requested for acceptance of the proposal of the Telugu University with regard to conduct of examinations.

3. After careful consideration, Government hereby accord permission for :-

a) introduction of "Andhra Natyam" discipline in Sri Tyagaraya College of Music & Dance, Hyderabad.

b) conducting examinations by Telugu University in "Andhra Natyam" Dance discipline along with other disciplines of Music & Dance; and

c) Telugu University to allow private students to appear for examinations in "Andhra Natyam" through Government Music & Dance Institutions.

(By order and in the name of the Governor of AndhraPradesh)

(Sd.) S. ANWAR,
Secretary to Government.

To

The Director of Cultural Affairs,
A.P., Hyderabad.
The Registrar, Telugu University, Hyderabad.
The Principal, S.T. Govt. College of Music & Dance, Hyd.
Copy to Education Department, A P. Secretariat, Hyd.
SF/SC.

Forwarded By Order

(Sd.) J. KUSUMA KUMARI
Section Officer.

# ఆంధ్రనాట్యం

## సిలబస్‌పైని వ్యాఖ్యానం

## మొదటి సంవత్సరం

ప్ర॥1. ఆంధ్రనాట్య మనగా నేమి?

స॥ అందాల భూమి ఆంధ్రదేశం. ఆంధ్రదేశంలోని బౌద్ధ ఆరామాల లోను, దేవాలయాలలోనూ, రాజాస్థానాలలోను, పండిత సభలలోను, సామాన్య ప్రజల సమావేశాలలోనూ విద్యావంతులైన స్త్రీ కళామూర్తులు ప్రదర్శించిన లాస్య నృత్యమే ఆంధ్రనాట్యం. దీనికి రెండువేల సంవత్సరాల చరిత్ర ఉందని పెద్దల అభిప్రాయం. ఇది స్త్రీల నాట్యం గనుక సుందరంగా, సుకుమారంగా, లలితంగా, కోమలంగా ఉంటుంది. ఈ నాట్యాన్ని పూర్వం నట్టువ మేళం, చిన్న మేళం, కచ్చేరి ఆట, దర్బారు ఆట, కర్నాటకం, మేజువాణి అని అనేవారు ఈ నాట్యం మూడు విధాలుగా అభివృద్ధి చెందింది :

1. దేవాలయాలలో దేవుని పూజించేటప్పుడు చేసిన నాట్యం,
2 రాజుల ఆస్థానాలలో పండితుల సమక్షంలో చేసిన నాట్యం,
3. సామాన్యప్రజలకోసం ఆలయం వెలుపల చేసిన నాట్యం.

ప్రస్తుత కాలంలో ఈ మూడు విధానాలను కలిపి ఈ నాట్యం ప్రదర్శింపబడుతూంది. ఇదే 'ఆంధ్రనాట్యం.'

ప్ర॥2. పేరిణీ తాండవం అనగా నేమి?

స॥ కాకతీయ గణపతి దేవుడు ఓరుగల్లు సామ్రాజ్యాన్ని సుమారు ఏడు వందల సంవత్సరాల క్రితం పాలించాడు. ఆయన ఆస్థానంలో జాయప ఉండే వాడు. అతడు గజసేనాపతే కాక గొప్ప పండితుడు, నాట్యకళావేత్త. గుండయామాత్యుడు అనే ఒక గొప్ప నాట్యాచార్యుని వద్ద ఇతడు నాట్యాన్ని నేర్చుకొన్నాడు. ఆ కాలంలో ఉండిన నాట్య పద్ధతుల గురించి సంస్కృతంలో "నృత్త రత్నావళి" అని నాట్యశాస్త్ర గ్రంథాన్ని జాయప వ్రాశాడు. ఆంధ్ర దేశంలో ఉండిన ప్రసిద్ధ శివ సంబంధమయిన నాట్యాల గురించి అందులో అతడు వివరించాడు. శివుణ్ణి ప్రార్థిస్తూ చేసిన నాట్యం గనుక దీనికి 'పేరిణీ శివతాండవం' అని పేరు వచ్చింది.

ప్ర॥3. ప్రాచీన కాలంలో వుండిన నాట్యశాస్త్రవేత్తలు ఎవరు?

స॥ ప్రాచీన కాలంలో ఉండిన నాట్యశాస్త్రవేత్తలు: శివుడు, గౌరి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుడు, దత్తిలుడు, కోహలుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, అంజనేయుడు, విఘ్నేశ్వరుడు, షణ్ముఖుడు, బృహస్పతి, అర్జునుడు, రావణుడు, ఉషాకన్య. వీరు భరత శాస్త్రీలు వ్రాసినట్లుగా కొని యాడబడ్డారు.

ప్ర॥4. నందికేశుని అభినయదర్పణానుసారం నృత్యం ఎలా పుట్టింది?

స॥ ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం అనే నాలుగు వేదాలలోని సారాన్ని అనగా ఋగ్వేదం నుండి వాద్యాన్ని, యజుర్వేదం నుండి నాలుగు రకాల అభినయాన్ని, సామవేదం నుండి గానాన్ని, ఆధర్వణ వేదం నుండి రసాలను గ్రహించి బ్రహ్మ నాట్యశాస్త్రాన్ని వ్రాశాడు. ఈ నాట్య శాస్త్రాన్ని నాట్యవేదం అని కూడా అంటారు అని అభినయదర్పణంలో ఉంది.

ప్ర॥ 5. భరతుని నాట్యశాస్త్రానుసారం నాట్యం ఎలా పుట్టింది?

స॥ ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, అధర్వణ వేదం అనే నాలుగు వేదాల నుండి వరుసగా పాఠ్యం, గీతం, అభినయాలు, రసాలు అనే నాలుగు నాట్యాంశాలను బ్రహ్మ గ్రహించి, నాట్యవేదాన్ని (నాట్యశాస్త్రాన్ని) వ్రాశాడని భరతుడు చెప్పాడు.

ప్ర॥ 6. భారతదేశంలోని నృత్య సంప్రదాయాలు ఎన్ని? అవి ఏవి?

స॥ భారతదేశంలో ఎనిమిది ప్రసిద్ధ నాట్య సంప్రదాయాలు ఉన్నాయి. అవి :

1. ఆంధ్రలో

A. ఆంధ్రనాట్యం (స్త్రీ సంప్రదాయం)

B. కూచిపూడి (పురుష సంప్రదాయం)

2. తమిళదేశంలో

A. భరతనాట్యం (స్త్రీల నాట్యం)

B. భాగవతమేళం (పురుష సంప్రదాయం)

3. కేరళ దేశంలో

A. మోహిని ఆట్టం (స్త్రీ సంప్రదాయం)

B. కథకళి (పురుష సంప్రదాయం)

4. కన్నడ దేశంలో

A. మైసూరు సాంప్రదాయక భరతనాట్యం (స్త్రీ సంప్రదాయం)

B. యక్షగానం (పురుష సంప్రదాయం)

5. ఉత్తర హిందూస్థానంలో కథక్

6. అస్సాంలో

A. అంకియా నట

B. వోజ్‌పాలి

7. మణిపురిలో మణిపురి నర్తనం

8. ఒరిస్సాలో ఒడిస్సీ నృత్యం.

ప్ర॥7. సంయుత, అసంయుత హస్తాలంటే ఏమిటి? వాటి లక్షణాలు ఏమిటి?

స॥ నృత్యాన్ని ప్రదర్శించేటప్పుడు నర్తకులు ప్రతి పదానికి చేతులతో అర్థాన్ని వివరించే సౌజ్ఞలను హస్తాలంటారు. ఇవి సంయుత, అసంయుత అని రెండు రకాలు.

ఒక చేతిలో అర్థాన్ని వివరించేది అసంయుతమని, రెండు చేతులూ కలిపి అర్థాన్ని వివరించేది సంయుతమని అంటారు.

ప్ర॥ 8. శైవ, వైఖానస, పాంచరాత్ర ఆగమ శాస్త్రాలను అనుసరించి ఆరాధన నృత్యాలను ఎలా చేసేవారు?

స॥ ఆగమ శాస్త్రాలు అంటే దేవాలయాలు నిర్మించే విధానం, వాటిలో దేవుళ్ళను ప్రతిష్టించే విధానం, పూజావిధానం, వాద్య, సంగీతం మొదలయిన వాటితో పాటుగా పూజాసమయంలో చేసే నృత్యాలను గురించి వివరించే శాస్త్రాలను ఆగమ శాస్త్రాలు అంటారు.

శివాలయాలకు సంబంధించిన ఆగమాన్ని 'శైవాగమం' అంటారు.

విష్ణు ఆలయాలకు సంబంధించినదాన్ని వైఖానసం, పాంచరాత్రం అంటారు.

శివ సంబంధమయిన ఆగమ శాస్త్రానికి, విష్ణు సంబంధమయిన ఆగమ శాస్త్రాలకు కొన్ని తేడాలు వున్నాయి ఈ శాస్త్రాలలో వివరించబడిన రీతులలో ఆరాధనా నృత్యాలను దేవనర్తకీమణులు ఆలయాలలో చేసేవారు.

ప్ర॥9. నృత్తం, నృత్యం, నాట్యం, లాస్యం, తాండవం, అడవు, అడుగు, జతి, జాతి, యతి, గతి, ముక్తాయి, తీర్మానం అంటే ఏమిటి?

స॥ 1. **నృత్తం :** మృదంగ జతులు లేక వివిధ రాగాల స్వరాలకు హస్తాలు, పాదాలను క్రమ పద్ధతితో కదలిస్తూ ఆడటం 'నృత్తం.'

2. **నృత్యం :** ఒక పాటలోని అర్థాన్ని హస్తాలతో వివరిస్తూ క్రమ పద్ధతిలో ఆడటం నృత్యం.

3. **నాట్యం :** ఏదయినా కథలోని పాత్రలను అనుసరించి పాడుతూ, నృత్త, నృత్య అభినయాలను ప్రదర్శిస్తూ ఆడటం నాట్యం.

4. **లాస్యం :** స్త్రీలు ప్రదర్శించే సుకుమార నృత్యం లేక నర్తనం లాస్యం.

5. **తాండవం :** పురుషులు ప్రదర్శించే ఉద్ధృతమయిన నృత్యం తాండవం.

6. **అడవు :** ఒక క్రమ పద్ధతిలో హస్త పాద విన్యాసాలతో వేసే అడుగు అడవు.

7. అడుగు : సహజంగా నడిచేటప్పుడు వేసే అడుగునే అడుగు అంటారు.

8. జతి : కొన్ని మృదంగ శబ్దాలను కూర్చి ఒక క్రమ పద్ధతిలో వాయించటం జతి. ఈ జతిని అనుసరించి క్రమబద్ధంగా అడవులు కూర్చబడతాయి.

9. **జాతి :** జాతి అంటే అక్షరాల నడక.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | చతురశ్ర | : | నాలుగు అక్షరాల నడక కల్గినది. | | | |
| 2. | త్రిశ్ర | : | మూడు | ,, | ,, | ,, |
| 3. | ఖండ | : | ఐదు | ,, | ,, | ,, |
| 4. | మిశ్ర | : | ఏడు | ,, | ,, | ,, |
| 5. | సంకీర్ణ | : | తొమ్మిది | ,, | ,, | ,, |

ఈ ఐదు రకాల నడకలు ఐదు జాతులుగా చెప్పబడ్డాయి.

10. **యతి :** మృదంగ శబ్దాలను వివిధ రీతుల్లో కూర్చి వాయించటాన్ని యతి విన్యాసం అంటారు.

ఉదా - మృదంగ రూపంలో, ఢమరక రూపంలో కూర్చి వాయించటం.

11. **గతి :** గతి అంటే నడక. నృత్యంలో సమగతి, విషమగతి, మయూర, మరాళ, మనుష్య, హరిణి, వ్యాఘ్ర మొదలయిన గతులు కలవు.

ఉదా - సమగతి : రెండక్షరాల నడక (సమ అనగా రెండుచేత విభజింపబడే సరిసంఖ్య.)

విషమగతి : మూడుగాని, ఐదుగాని - యిలా బేసిసంఖ్య, అనగా రెండుచేత విభజించబడని సంఖ్య.

12. ముక్తాయి : ముందుకు నడిపించేది ముక్తాయి. తధిగిణతోం, తధిగిణతోం, తధిగిణ అని జతిని ప్రారంభించటం ముక్తాయి లేక ముక్తాయింపు.

**13 తీర్మానం లేక ముగింపు :** తధిగిణతోం, అని మూడుసార్లు వాయించి ముగించటం తీర్మానం లేక ముగింపు.

# ఆంధ్రనాట్యం

## మొదటి సంవత్సరం

## ప్రాయోగికం

**I. శారీరక వ్యాయామం**

(ఎ) చిక్కులు తీయడం

(బి) సాము (సన్నని కర్రతో)

(సి) దండేలు, బస్కీలు, కుప్పిలు

**II. అడుగులు**

(ఎ) సమగతి, విషమగతి నడకలు

(బి) అడవులు

(1) తై అడవులు (2) దితై అడవులు

తెయ్యతై - తెయ్యం - దత్తా - తతై - తై దిదితై

**III. పంచగతులు**

1. చతురశ్ర జాతి (నాలుగు అక్షరాల) గతి

తకదిమి తకజణు

2. తిశ్రజాతి (మూడు అక్షరాల) గతి

తకిట తకిట తకిట తకిట

3. మండె - తాంత తైతాం

4. ఖండ జాతి (5 అక్షరాల) గతి

తక - తకిట । తక - తకిట

5. మిశ్రజాతి (7 అక్షరాల) గతి

తకిట - తకదిమి । తకిట - తకదిమి

6. సంకీర్ణ (9 అక్షరాల) గతి

తక దిమి - తక - తకిట ।

IV. తీర్మానాలు

గిణత - 3 అక్షరాలు

దిగిణత - 4 అక్షరాలు

తదిగిణత - 5 అక్షరాలు

తక తదిగిణత - 7 అక్షరాలు

తక దికి తదిగిణత - 9 అక్షరాలు

5 జాతుల్ని కలిపి

దిగి ణత - గిణత - తక తది గిణత

తదిగిణత - తకదికి తదిగిణత

V శ్లోకాలు

VI ఆరాధనా పూజావిధానంలో పుష్పాంజలి.

ప్రాచీన కాలంలో నాట్యారంభంలో నర్తకి దోసిలితో పూలను పట్టుకొని సమంలో (సమస్థానకంలో) నిలబడి రెండు పాదాలను సమంగా ఉంచి, కాలి బొటన వేళ్ళను దగ్గరగా చేర్చి నిలబడి చూర్ణికలను (సంస్కృత స్తోత్ర గీతాలను) పఠించి, దేవతలకు పూవులు సమర్పించి, తర్వాత అడ్డిత చారీ విన్యాసాలను ప్రదర్శించేది.

పూవులను సమర్పించిన తర్వాత నర్తకి రెండు చేతులతో పతాక హస్తాలు పట్టి నిలబడి, తర్వాత కుడి ఎడమలకు, ముందు వెనుకలకు పాద విన్యాసాలు చేస్తూ అడ్డి మొహరతో ముగించేది. ఈ ఆటను అడ్డితం అంటారు,

ఏ నాట్యం ఆడినా ముక్తాయితో ప్రారంభించి, తీర్మానంతో ముగించి, ఆ తర్వాత మొహరతో ఆ నాట్య కార్యక్రమాన్ని ముగించడం పూర్వకాలంలో ఒక ఆచారంగా ఉండేది. ఏ తాళంలో, ఏ గతిలో ఆడినా చతురస్ర (4 అక్షరాల) గతిలో మళ్ళీ ఆడి నాట్యాన్ని ముగించాలి.

పూర్వం అడ్డితాన్ని 5 అక్షరాల గతిలో ప్రదర్శించేవారు (అంటే సమం - 2 అక్షరాలు, విషయం 3 అక్షరాల కాలం. ఈ రెండూ కలిపితే 5 అక్షరాల కాలం.)

అటుపైని 4 అక్షరాల గతిలో తీర్మానించి, తర్వాత మొహరను ప్రదర్శించాలి.

పాఠ్యాలు :

తాం తత్తై తై । తై జగ దత్తాం



# ఆంధ్రనాట్యం

## రెండవ సంవత్సరం

### సిద్ధాంతం

ప్ర॥1. శైవ, వైఖానస, పాంచరాత్ర ఆగమాలలోని నృత్త, నృత్య రీతులను వివరించండి.

స॥ శైవ, వైఖానస, పాంచరాత్రాలలో నృత్తానికి సంబంధించిన అంశాలు ప్రధానంగా ప్రదర్శింపబడతాయి. కొన్ని ప్రత్యేక వేళల్లో దేవతలకు స్తోత్ర గీతాలను పాడినా అవి నృత్తప్రాధాన్యతతో ప్రదర్శింపబడతాయి.

ప్ర॥2. దేవాలయాలలో ఉత్సవ సమయమందు ప్రత్యేకంగా ప్రదర్శింపబడే నృత్యాల గురించి క్లుప్తంగా తెలియజేయండి.

స॥ ప్రతిదినం దేవుని ఉదయం మేల్కొలుపులు మొదలుకొని రాత్రి దేవుని నిద్రపుచ్చేవరకు, తర్వాత ఆలయాన్ని అష్టదిక్పాలులకు అప్పగించేవరకు షోడశోపచారాలలో గానం, నృత్యం తప్పక ఉండేవి. అష్టదిగ్బంధన, బలిహరణ, ధ్వజారోహణ, మహాభోగం, భేరిపూజ, పుష్పయాగాలందు, సాయంత్రం స్వామి కొలువుతీరి యున్నప్పుడు నృత్య ప్రదర్శన లుండేవి.

శివాలయాల్లో ముఖ్యంగా సంధ్యవేళ, 'లింగోద్భవ' కాలంలో తప్పనిసరిగా నృత్య ప్రదర్శన ఉండేది.

ప్ర॥3. ఇంద్రుని కొలువులో నుండిన ప్రముఖ దేవ నర్తకులు ఎవరు? వారి నృత్య రీతులను వివరించండి.

స॥ ఇంద్రుడు నృత్యగాన ప్రియుడు. అతని కొలువులో నుండిన దేవ నర్తకులలో మేనక, రంభ, ఊర్వశి, తిలోత్తమ ప్రముఖులు.

మేనక :

సాము, గరడీ విద్యలందు అనగా మొగ్గలు వేయడం, కుండ మీద నృత్యం చేయడం, పళ్ళెంపైన నృత్యం చేయడం మొదలైనవాటిలో ఈమె ప్రసిద్ధురాలు.

రంభ :

మృదంగ జతులకు రాగాల స్వరాలకు నర్తనమాడడంలో ఈమె పేరు గాంచింది.

ఊర్వశి :

పాటలలోని అర్థాలను, భావాలను తెలియజేస్తూ అభినయించి ఆడడంలో ఈమె ప్రఖ్యాతురాలు.

ప్ర॥4. ఊర్వశి జననం గురించి తెలియజేయండి.

స॥ ఒకసారి నరనారాయణులు బదరికావనంలో తపస్సుచేసుకొంటున్నారు. ఇంద్రునికి ఈర్ష్య పుట్టింది. వారి తపస్సు పాడుచేయమని ఇంద్రుడు రంభను పంపాడు. రంభ వెళ్ళింది. నారాయణుడు ఇంద్రుని కుట్రను తెలుసుకొని, రంభ కన్నా అందమైన స్త్రీని తన ఊరువులో (తొడలో) నుండి సృష్టించాడు. ఆ సుందరిని చూసి రంభ సిగ్గుపడింది. ఇంద్రుడు ఓడిపోయాడు. నారాయణుని వద్దకు వెళ్ళి, తన తప్పును ఒప్పుకొని, తనని క్షమించమని నారాయణుని ప్రార్థించాడు. నారాయణుడు ఇంద్రుణ్ణి క్షమించడమేకాక తను సృష్టించిన ఊర్వశిని ఇంద్రునికి ఇచ్చాడు. ఆనాటినుండి ఊర్వశి ఇంద్రుని కొలువులో ఒక ప్రధాన నర్తకి అయింది. నారాయణుని ఊరువులోనుండి పుట్టింది గనుక ఆమెకు ఊర్వశి అని పేరు వచ్చింది.

ఈమె సంతతివారే ఆంధ్రదేశంలో దేవాలయాలలో నృత్యపూజచేసేవారు.

రంభ, మేనకల సంతతికి చెందినవారు పండితసభల్లోను, పెండ్లి వేడుకల్లోను, ఉత్సవాలలోను నాట్యం చేసేవారు. (నర్తకుల వంశాలకు చెందినవారు చెప్పగా సేకరించిన సంగ్రహ చరిత్ర ఇది.)

ప్ర॥5. సంయుత, అసంయుత హస్తాల వినియోగాలు ఏమిటి?

స॥ నృత్యం, అభినయంలో అనేక శ్లోకాలు, పాటలు పాడుతూ ఉంటారు. చూసేవారికి వాటి అర్థం తెలిసేటట్టు నర్తకులు ఆడాలి. వాటి అర్థాన్ని తెలియ జేయడానికి చేతుల్ని అనేక విధాలుగా కదిలిస్తూ, చేతి వేళ్ళను ముడుస్తూ, తెరుస్తూ ఉంటారు ఒక్కొక్కప్పుడు ఒక్క చేత్తోనే చేస్తారు. ఒక్కొక్కప్పుడు రెండు చేతులతోను చేస్తూ ఉంటారు. ఈ చేతుల కదలికలనే హస్తాలంటారు. రెండు చేతులతోను అర్థాన్ని వివరిస్తే అది సంయుత హస్తం, ఒకే చేత్తో అర్థాన్ని వివరిస్తే అసంయుత హస్తం. ఈ హస్తాల వినియోగం ద్వారా ప్రేక్షకులు ఆ యా మాటల అర్థాలను తెలుసుకోగలుగుతారు.

ప్ర॥6. నృత్త, నృత్య హస్తాల గురించి తెలియజేయండి.

స॥ 1. నృత్త హస్తాల సంఖ్య తక్కువ. అయితే వీటిలో పతాకం, అర్ధ పతాకం, త్రిపతాకం, కర్తరీ ముఖ, ముష్టి, శిఖర, అర్ధ చంద్ర, పాశ, పల్లవ, కటకాముఖ ముఖ్యమైనవి.

2. నృత్యహస్తాలు చెప్పలేనన్ని ఉన్నాయి. అయితే, వీటిలో దేవతలకు, నవగ్రహములకు, అష్టదిక్పాలకులకు, దశావతారములకు సంబంధించిన హస్తాలు కొన్ని ఉన్నాయి. ఇవికాక నదులు, చెట్లు, పక్షులు, నవరత్నాలు మొదలైన వాటికి సంబంధించిన హస్తాలుకూడా ఉన్నాయి. సంయుత, అసంయుత హస్తాలు నృత్య, అభినయాలలో ప్రయోగింపబడుతూ ఉంటాయి.

**అసంయుత హస్తాలు :** పతాక, త్రిపతాక, అర్ధ పతాక, కర్తరీ ముఖ, మయూర, అర్ధచంద్ర, అరాళ, శుకతుండ, ముష్టి, శిఖర, కపిత్థ కటకా ముఖ, సూచీ, చంద్రకళ, పద్మకోశ, సర్పశీర్ష, మృగశీర్ష, సింహముఖ, లాంగుల, అల పద్మ (సోలపద్మ), చతుర, భ్రమర, హంసాస్య, హంస పక్ష, సందంశ, ముకుళ, తామ్రచూడ, త్రిశూల.

**సంయుత హస్తాలు :** అంజలి, కపోత, కర్కట, స్వస్తిక, డోల, పుష్ప పుట, ఉత్సంగ, శివలింగ, కటకావర్ధన, కర్తరీ స్వస్తిక, శకట, శంఖ, చక్ర సంపుట, పాశ, కీలక, మత్స్య, కూర్మ, వరహ, గరుడ, నాగ బంధ, ఖట్వా భేరుండ, అవహిత్థ.

ప్ర॥ 7. అంగాలు, ప్రత్యంగాలు, ఉపాంగాల గురించి తెలియజేయండి.

స॥ తల. చేతులు, చంకలు, పార్శ్వములు, నడుం, పాదాలు - ఈ ఆరింటిని అంగాలంటారు. కొందరు కంఠాన్ని కూడా అంగమంటారు.

మూపులు, భుజాలు, వీపు, కడుపు, తొడలు, పిక్కలు- ఈ ఆరింటిని ప్రత్యంగాలంటారు కొందరు మణికట్టు, మోచేతులు, మోకాళ్ళను గూడ ప్రత్యంగాలలో చేర్చారు

చూపు, రెప్పలు, నల్లగుడ్డు, చెక్కిళ్ళు, ముక్కు, దవడలు, పెదవులు, దంతాలు, నాలుక. గడ్డం, ముఖం, తల- ఈ పన్నెండింటిని ఉపాంగాలంటారు.

ప్ర॥ 8. శిరోభేదాలు, దృష్టిభేదాల గురించి తెలియజేయండి.

స॥ సమం, ఉద్వాహితం, అధోముఖం, ఆలోళితం, ధుతం, కంపితం, పరావృత్తం, ఉత్క్షిప్తం, పరివాహితం- ఈ తొమ్మిదింటిని శిరోభేదా లంటారు.

సమం ఆలోకితం. పాచి, ప్రలోకితం, నిమీలితం, ఉల్లోకితం, అనువృత్తం, అవలోకితం. ఈ ఎనిమిదింటిని దృష్టి భేదా లంటారు.

ప్ర॥ 9. హస్త ప్రాణాలు ఎన్ని? అవి ఏవి?

స॥ హస్త ప్రాణం అంటే హస్తాలు పట్టే పద్ధతి. హస్త ప్రాణాలు పన్నెండు. అవి 1) ప్రసారణం, 2) కుంచితం, 3) రేచితం, 4) పుంఖితం, 5) అపవేష్టితకం, 6) ప్రేరితం, 7) ఉద్వేష్ఠితం. 8) వ్యావృత్తం, 9) పరివృత్తం, 10) సంకేతం, 11) చిహ్నం, 12) పదార్థ టీక.

ప్ర॥10. చారి, రేచకం, కరణం, అంగహార, భ్రమరి, ఉత్ప్లవనం, రాజనర్తకి, ప్రజానర్తకి, నాయకురాలు, సొల్లుకట్టు, కౌతం, కైవారం, మేళం మేజువాని - వీటిని నిర్వచించండి.

స॥ **చారి :** ఒక కాలుతో విన్యాసం చేయడం, చారులు లేని నాట్యం ఉండదు. ఇవి లేకపోతే ప్రపంచంలో చలనం ఉండదు.

**రేచకం :** చేతుల్ని, నడుంని కదలించడం.

**కరణం :** ఒక క్రమ పద్ధతిలో కాళ్ళను, చేతుల్ని కుడి, ఎడమలకు కదలించడం.

**అంగహారం :** ఒక క్రమ పద్ధతిలో కాళ్ళను, చేతుల్ని కొన్ని రీతుల్లో కదిలించి, ప్రదర్శించి, ముగించడం.

భ్రమరి : గుండ్రంగా తిరగడం.

**ఉత్ప్లవనం** : గాలిలోకి ఎగరడం. దీనినే కుప్పి అని కూడా అంటారు.

**దేవనర్తకి** : దేవాలయ పూజల్లో పాల్గొనే నర్తకి.

**రాజనర్తకి** : రాజుల ఆస్థానాలలో, పండిత సభలో నాట్యం చేసే నర్తకి.

**ప్రజానర్తకి** : దేవుని ఉత్సవాలలో సామాన్య ప్రజల కోసం నాట్యమాడే నర్తకి.

**నాయకురాలు** : స్త్రీల నాట్య బృందానికి పెద్దరికం వహించి, తాళం వేస్తూ, నాట్యం చేయించే నర్తకి.

**సొల్లుకట్టు** : కొన్ని మృదంగ శబ్దాలను జతిగా కూర్చి నాట్యంలో చెప్పడం.

కౌతం : ఆలయాల్లో దేవతలను స్తుతిస్తూ చేసే ప్రత్యేక నాట్యం.

**కైవారం** : దేవతల్ని గాని, రాజుల్ని గాని స్తుతిస్తూ చేసే నాట్యం.

**మేళం** : నాయకురాలు, నర్తకబృందం, మృదంగం, శ్రుతి, వేణువు, ముఖవీణ, వాయువీనం మొదలగు వాద్యాలు, తాళాలు వీటితో కలిసి యున్న సమ్మేళనం.

**మేజువాని** : కవులు, పండితులు, విద్యాంసులకు విజ్ఞాన విందుగా నర్తకి సభలో కూర్చొని వివిధ రకాలైన పాటలను అభినయించడం.



# ఆంధ్రనాట్యం

## రెండవ సంవత్సరం

## ప్రాయోగికం

1. **వినాయక కౌతం :** వినాయక తాంళాంగములతో ప్రదర్శించుట

**వినాయక తాళాంగాలు**

గ గ గ ల ల ప గ ల ల ప

గ = గురువు = 8 అక్షరాలు

ల = లఘువు = 4 అక్షరాలు

ప = ప్లుతం = 12 అక్షరాలు

వినాయక తాళం 72 అక్షరాలు గలది.

2. **కైవారం :** దేవుని పూజలో ప్రదర్శింపబడే నాట్యం.

**ఉదాహరణలు :**

శివకైవారం : గంగాధరపర

విష్ణుకైవారం : శ్రీలనీలావతి

3. **శబ్దం :** భారత, భాగవత, రామాయణాది పురాణ కథల వర్ణన గీతాలకు నృత్య, అభినయాలను ప్రదర్శించడం. 'సలాం' అనే మాటతో ముగిసిన శబ్దాలను సలాం జతులని కూడా అంటారు.

**ఉదాహరణలు :**

**శబ్దం :** సారెసారెకు కాశీనాథుని ధరణి రథమై (కాశీనాథకవి)

**సలాంజతి :** నిరంతరము ఈ ధరన్ అందము అందచందము

(ప్రతాపరాముని పైని చెప్పబడినవి)

4. పద్యం : నల్లనివాడు (పోతన భాగవతం)
5. శ్లోకం : కస్తూరీ తిలకం (కృష్ణ కర్ణామృతం)
6. గీతం : రారా మా యింటికి కృష్ణయ్య
7. అన్నమాచార్య కీర్తన : ముద్దుగారే యశోదా

V. శ్లోకాలు

1. శివ స్తోత్రం

ఆంగికం, భువనం యశ్య
వాచకం సర్వ వాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్వికం శివమ్॥

2. గురు స్తోత్రం

గురు బ్రహ్మ, గురు విష్ణుః
గురు దేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః

3. భూదేవి స్తోత్రం

సముద్ర వసనే దేవి
పర్వత స్తన మండలే
నాట్యం గరిష్యే భూదేవీ
పాదఘాతం క్షమాస్వమే.

# ఆంధ్రనాట్యం

## మూడవ సంవత్సరం

## సిద్ధాంతం

ప్ర॥1. దేవతా హస్తాలు, అష్టదిక్పాలకుల హస్తాలు, దశావతార హస్తాలు, బాంధవ్య హస్తాల గురించి వివరించండి.

స॥ శివుడు, పార్వతి, విష్ణువు, లక్ష్మి, కృష్ణుడు, బ్రహ్మ, సరస్వతి, విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు - ఈ దేవతలను సూచించే హస్తాలను దేవతా హస్తా లంటారు.

ఇంద్రుడు, అగ్ని, యముడు, నైరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశాన్యుడు - వీరిని సూచించే హస్తాలను అష్టదిక్పాలకుల హస్తా లంటారు.

మత్స్యావతారం, కూర్మావతారం, వరహావతారం, నృసింహావతారం, వామనావతారం, పరశురామావతారం, రామావతారం, బలరామావతారం, కృష్ణావతారం, బుద్ధావతారం, కలికావతారం - వీటిని సూచించే హస్తాలను దశావతార హస్తా లంటారు. (కృష్ణుని అవతారంగా పరిగణించరు కాని, ఆంధ్ర నాట్య సంప్రదాయంలో కృష్ణుని ఒక అవతారంగా పరిగణిస్తున్నారు.)

తల్లి, తండ్రి, అత్త, మామ, భార్య, భర్త, మరది, అన్న, వదిన, కుమారుడు, అల్లుడు - వీరిని సూచించే హస్తాలను బాంధవ్య హస్తాలంటారు.

ఇవి కాక బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులను సూచించే హస్తాలు కూడ ఉన్నాయి.

ప్ర॥2 మార్గ, దేశీ పద్ధతులు అంటే ఏమిటి?

స॥ భరత శాస్త్రాన్ని పూర్తిగా అనుసరించి, అభివృద్ధి చెందిన నృత్య సంప్రదాయాన్ని "మార్గి" అంటారు. భరత దేశమంతటా ఒకే రీతిలో ఉంటుంది.

ఆయా ప్రాంతాల ఇష్టాయిష్టాలు, అభిరుచులను అనుసరించి, భరతశాస్త్ర ఆధారంతో అభివృద్ధి చెందిన నృత్య సంప్రదాయాన్ని 'దేశి' అంటారు.

ప్ర॥3. భ్రూ, గ్రీవా భేదాలను వివరించండి.

స॥ సహజం, పతితం, ఉత్క్షిప్తం, చతురం, రేచితం, కుంచితం - ఈ యారింటిని భ్రూ భేదాలంటారు. (భ్రూ అనగా కనుబొమలు.)

సుందరి, తిరశ్చీనం, పరివర్తితం, ప్రకంపితం - ఈ నాల్గింటిని గ్రీవా భేదాలంటారు. (గ్రీవం అంటే మెడ.)

ప్ర॥4. చతుర్విధాభినయాల లక్షణాలను వివరించండి.

స॥ ఆంగికం, వాచికం, ఆహార్యం, సాత్త్వికం అని అభినయం నాలుగు విధాలు.

**ఆంగికం :** ఒక పాట అర్థాన్ని అంగాలు, ప్రత్యంగాలు, ఉపాంగాల ద్వారా విశదీకరించి చెప్పడం.

**వాచికం :** ఒక పాట లేక పద్యంలోని భావానికి, అర్థానికి తగినట్లుగా పాడడం.

**ఆహార్యం :** పాత్రకు తగిన రీతిలో వేషం ధరించడం.

**సాత్త్వికం :** పాటలోని భావాన్ని హస్త ముద్రల ద్వారా కాకుండా ముఖ కదలికల ద్వారా తెలియజేయడం. దీనిని 'ముఖరాగం' అని కూడా అంటారు.

నాట్యం రెండు విధాలు : 1. బహు పాత్రలుండే నృత్యనాటకం, 2. ఒకే పాత్ర ప్రదర్శించే నృత్యకేళిక. సాధారణంగా నృత్యనాటకాల్లో సన్నివేశాలకు తగినట్టుగా తెరలు కట్టుకొంటారు ఏక పాత్ర కేళికకు తెర ఉండదు. పూర్వం ఆడే పాత్ర పాడడం, హస్తాలతో అర్థం చెప్పడం, కళ్ళతో భావాన్ని ప్రదర్శించడం, పాదాలతో తాళంవేయడం ఆచారంగా ఉండేది. ఈనాడు ఈ యాచారం పోయి, నేపథ్య సంగీతంపైని ఆధారపడుతున్నారు.

ప్ర॥ 5. భావం, రసం - వీటిని విశదీకరించండి.

స॥ ఆంగికాభినయం అంటే పాటలోని పదాలకు అర్థం చెప్పడం, సాత్వికాభినయం అంటే పాటలోని భావాన్ని చెప్పడం.

పాట వ్రాసిన కవి సుఖదుఃఖాల అనుభూతులను తన పాటలో ఇమిడ్చి చెప్పినప్పుడు నర్తకుడు ఆ యనుభూతులను తాను అనుభవిస్తూ ప్రదర్శించడం భావాభినయం. ఇదే భావం.

ఈ భావాభినయాన్ని చూసినప్పుడు ప్రేక్షకులో ఒకవిధమైన హృదయ స్పందన కలుగుతుంది. ఇదే రసం.

ప్ర॥ 6. నాట్యధర్మి, లోకధధర్మి అంటే ఏమిటి?

స॥ భరతుని నాట్యశాస్త్రం నందికేశుని అభినయ దర్పణం, జాయప నృత్త రత్నావళి మొదలైన నాట్యశాస్త్ర గ్రంథాలలోని శాస్త్ర పద్ధతులను అనుసరించి ప్రదర్శించే నాట్యం నాట్యధర్మి.

లోకం పోకడలను అనుసరిస్తూ ఈ శాస్త్రాలలోని పద్ధతులను తీర్చిదిద్దుకొని ప్రజల అభిరుచులకు తగినట్టుగా నాట్యాన్ని ప్రదర్శించడం లోకదర్మి.

ప్ర॥ 7. ఆంధ్రదేశ నృత్యకళా చరిత్రను క్లుప్తంగా తెలియజేయండి.

స॥ పూర్వకాలం నుండి ఆంధ్రుల నృత్యకళ రెండు విధాలుగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. స్త్రీలు ప్రదర్శించేది లాస్యం. పురుషులు ప్రదర్శించేది తాండవం. స్త్రీల లాస్యాన్ని శివుని అర్ధాంగి పార్వతీ దేవి రూపొందించిందని, తాండవాన్ని శివుడు రూపొందించాడని శాస్త్రకారులు చెప్పారు. స్త్రీల లాస్యం సొగసుగా, కోమలంగా ఉంటుంది. పురుషుల తాండవం గంభీరంగా, ఉద్ధతంగా ఉంటుంది. స్త్రీల లాస్యం ఏక పాత్ర కేళిక. ఒకే నర్తకి నృత్త, నృత్య, అభినయాలను ఒక క్రమ పద్ధతిలో ప్రదర్శించేటట్టు ఈ లాస్యం అభివృద్ధి చెందింది. ఇది నృత్తంతో ప్రారంభమై, నృత్య, అభినయాలతో ముగుస్తుంది. ఇది పూర్వ ముండిన ఆచారం. దీనిని నట్టువ మేళం అనేవారు.

పురుషుల నాట్యాన్ని నాట్యమేళం అంటారు. దీనిలో బహుపాత్రలు ఉంటాయి. ఆయా పాత్రలకు తగినట్టుగా వేషధారణ ఉంటుంది. ఒక కథ, సాధారణంగా ఒక పురాణ కథను వీరు ప్రదర్శించేవారు. పూర్వం కొన్ని తెగలకు చెందిన పురుషులే ఈ పురాణ కథలను ప్రదర్శించేవారు, ఈనాడు ఏ కథనైనా స్త్రీ, పురుష నాట్యకళాకారులు ప్రదర్శిస్తున్నారు.

పూర్వం ఈ కళలను రాజులు, ధనికులు, ఆలయ అధికారులు పోషించారు. దేవ గణికలు, రాజాస్థాన గణికలు, ఇతర స్త్రీ కళాకారులు లాస్యాన్ని ఆరాధించారు.

భాగవతులు, నాట్యమేళాలవారు తాండవాన్ని ఆరాధించారు. ఈ భాగవత మేళాలవారు, నాట్యమేళాలవారు ఊరూరు, పల్లెపల్లె వాడవాడ తిరుగుతూ మన మతాన్ని, సంప్రదాయాన్ని నృత్య నాటకాల ద్వారా ప్రదర్శించి ప్రజలకు బోధించేవారు.

స్త్రీ కళాకారులు ఆలయాల్లోను, ఆలయ ప్రాంగణాలలోను, రాజుల ఆస్థానాలలో మాత్రమే కేళికలు చేసేవారు. ఆలయ ఉత్సవాలలో మాత్రం సామాన్య ప్రజలకోసం వీరు పౌరాణిక కథలను ప్రదర్శిస్తూ ఉండేవారు. ఆ కాలంలో ప్రయాణ సౌకర్యాలు లేకపోవడంవల్ల స్త్రీలు సంచారం చేసేవారు కారు.

ప్ర॥8. పాత్ర లక్షణం, అపాత్ర లక్షణం, పాత్ర అంతః, బహిప్రాణాల గురించి వివరించడి.

స॥ నందికేశ్వరుని అభిప్రాయం ప్రకారం రూపవతి, యౌవన మధ్యస్తురాలు, ప్రౌఢ, రసికురాలు, మనోహరిణి, పట్టువిడుపులందు సమర్థురాలు, తాళగతులను తెలిసియున్నది, నృత్యంలో పండితురాలు, హస్త విన్యాసంలో నేర్పుగలది, కరణాల చాకచక్యము గలది, విశాలమైన కన్ను గలది, గీత వాద్య తాళాలను అనుసరించి నడవగలది, వెలగల ఆభరణాలు ధరించింది, ప్రసన్న ముఖం గలది మరీ పొడవు కాకుండా, మరీ పొట్టి కాకుండా, చాలా లావు, చాలా సన్నము కాకుండా న ర్తకి ఉండాలి. ఇవి పాత్రకు ఉండవలసిన లక్షణాలు.

కంటిలో పూవులుండినది, తల వెంట్రుకలు లేనిది, పెద్ద పెదవులు గలది, బాగా బలిసినది, బాగా చిక్కిపోయినది, మిక్కిలి పొట్టిది, గూను ఉన్నది. హీనస్వరం గలది నాట్యానికి తగినది కాదు. ఇవి అపాత్ర లక్షణాలు అని నంది కేశ్వరుడు చెప్పాడు.

మృదంగం, మంచి నాదం గల తాళాలు, పిల్లనగ్రోవి, పాట, శ్రుతి, వీణ, గజ్జెలు, ప్రఖ్యాతుడైన గాయకుడు - పాత్రకు (నర్తకులకు) ఈ ఎనిమిది బహిఃప్రాణాలు.

వడి, నిలుకడ, సమత్వం, భ్రమరీ విన్యాసం, చక్కని చూపు, శ్రమలేమి, ధారణశక్తి, శ్రద్ధ, మాటనేర్పు, పాట - ఈ పదీ పాత్రకు అంతఃప్రాణాలు,

ప్ర 9. శాస్త్రీయ నాట్య, నృత్యశాస్త్ర గ్రంథకర్తల గురించి తెలియజేయండి.

స॥ భరతుడు, నందికేశుడు, జాయప, సారంగదేవుడు - వీరిని ప్రాచీన నాట్యశాస్త్ర గ్రంథకర్తలుగా చెప్పవచ్చును. భరతుణ్ణి ఒక ఋషిగా మన పెద్దలు పరిగణించారు. ఇతడు నాట్యశాస్త్రాన్ని రచించాడు. భారతదేశ నాట్యకళాకారులకు ఇది చాలా ముఖ్యమైన గ్రంథం కనుక దీనిని పంచమ వేదంగా పరిగణించారు. బహు పాత్రల నృత్య నాటకాలను శాస్త్రీయంగా ప్రదర్శించే విధానాన్ని భరతుడు ఈ గ్రంథంలో చెప్పాడు. భరతుడు ఈ గ్రంథాన్ని రచించక పోయుంటే శాస్త్రీయంగా నాట్యకళ భరతదేశంలో ఇంత అభివృద్ధిచెందియుండేది కాదు.

నందికేశుడు అభినయ దర్పణాన్ని వ్రాశాడు. నృత్య నాటకాలకు భరతుడు ఎంత ముఖ్యుడో, ఏకపాత్ర నృత్యకేళికలకు నందికేశుడు అంత ముఖ్యుడు.

ఒకే నర్తకి నృత్త, నృత్య అభినయాలను ఏ విధంగా ప్రదర్శించాలో ఆ పద్ధతిని ఇతడు తన అభినయదర్పణంలో వివరించాడు. నృత్త, నృత్యాలను విడదీసి, వీటిని వేర్వేరుగా రూపొందించి, వీటిని ప్రదర్శించే విధానాన్ని చెప్పాడు.

జాయప సేనాని, సారంగదేవుడు సమకాలికులు. వీరిద్దరు 13 వ శతాబ్దికి చెందినవారు.

జాయప కాకతి గణపతి దేవుని ఆస్థానంలో ఉండేవాడు. ఇతడు గణపతి దేవుని బావమరిది. కాకతీయ సైన్యములో ఈతడు గజసేనాపతిగా ఉండేవాడు.

జాయప నృత్త రత్నావళి, గీత రత్నావళి, వాద్య రత్నావళి అనే మూడు శాస్త్ర గ్రంథాలను వ్రాశాడు. గీత రత్నావళి, వాద్య రత్నావళి మనకు దొరకలేదు. మన అదృష్టంకొద్దీ నృత్త రత్నావళి మనకు దొరికింది. అందువల్ల ఆ కాలంనాటి నృత్య విశేషాలను మనం తెలుసుకొనగలుగుతున్నాం.

సారంగదేవుడు దేవగిరి యాదవరాజు ఆస్థానంలో ఉండేవాడు. ఇతడు గొప్ప పండితుడు, శాస్త్రవేత్త. ఇతడు 'సంగీత రత్నాకరం' అనే సంగీత శాస్త్ర గ్రంథాన్ని వ్రాశాడు. ఇందులో గాత్ర, వాద్య సంగీతాల గురించే కాక, నృత్యం గురించి కూడా వ్రాశాడు.

ప్ర॥ 10. కాకతి గణపతి దేవుని మొదలుకొని కృష్ణదేవరాయలు, కొమరగిరి, సర్వజ్ఞ సింగభూపాలుడు, నాయక రాజులు, గోల్కొండ పాదుషాలు, మహారాష్ట్ర ప్రభువులు వరకు వారు నృత్యకళకు చేసిన సేవలను వివరించండి.

స॥ కాకతి గణపతిదేవుని ఆస్థానంలో జాయప అనే ఒక గొప్ప నర్తకుడు, నాట్యకళా శాస్త్రవేత్త ఉండేవాడు ఆ కాలంలో మన ఆంధ్రదేశంలో ఉండిన అనేక దేశి నర్తనాల గురించి తన నృత్త రత్నావళి గ్రంథంలో అతడు వివరించాడు.

కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుడు గొప్ప నృత్యకళా పోషకుడు. ఈతని ఆస్థాన నర్తకీమణి 'మాచల్‌దేవి' నృత్యకళా చరిత్రలో ప్రసిద్ధురాలు. ఆమె తమ వంశచరిత్రను యక్షగానంగా రచన చేయించి, తన మహల్‌లో ఆడించి, చూచి, ఆనందించింది.

కృష్ణదేవరాయలు దర్బారులో అష్ట దిగ్గజాలతో సమానంగా గౌరవింపబడిన ఆస్థాన నర్తకీమణి 'రంజకం కుప్పాయి' అంటే-అష్టదిగ్గజాలను, అప్పాజీ, తాతాచార్యులు, కవి, గాయక, పండిత, శాస్త్రవేత్తల సమక్షంలో రాయల వారి దర్బారులో నాట్యం చేసి, వారందరినీ మెప్పించినదని మనం గ్రహించవచ్చును. ఈమె తన తండ్రి విద్యాస్వభారంజక రంజకం శ్రీ రంగరాజు వద్ద నాట్యం నేర్చుకొన్నది.

'వసంత రాజీయం' అనే నృత్య శాస్త్రగ్రంథాన్ని వ్రాసిన కర్పూర వసంతరాయలు గొప్ప నృత్యకళా పోషకుడు. 'లకుమ' అనే ఒక గొప్ప నర్తకీమణి ఈతని ఆస్థానమందుండేవి.

'రసార్ణవ సుధాకరము' అనే శాస్త్రగ్రంథాన్ని వ్రాసిన సర్వజ్ఞ సింగ భూపాలుడు గొప్ప నృత్యకళా పోషకుడు. ఈతని ఆస్థానంలో 'భోగిని' అనే నర్తకీమణి ఉండేది.

తంజావూరు ప్రభువు రఘునాథ నాయకుడు కళాపోషకుడు, కవి, సంగీత శాస్త్రజ్ఞుడు, గ్రంథకర్త. ఈతని ఆస్థానం ఒక శారదా నిలయం. ఈతని దర్బారులో 'రామభద్రాంబ' అనే ఒక ప్రఖ్యాత కవయిత్రి, గంటకు నూరు పద్యాలు వ్రాసిన (శతలేఖిని) మధురవాణితో బాటు 'ముద్దు చంద్రరేఖ' అనే ఒక మహానర్తకి ఉండేది. వీరుగాక ఇంకా అనేకమంది నర్తకీమణులు ఈయన ఆస్థానంలో ఉండేవారు. పదాలు వ్రాయడంలో తనకు తనే సాటి అని పేరు గాంచిన క్షేత్రయ్య ఈ ఆంధ్ర నాట్యకళా పోషకుని దర్బారును సందర్శించాడు.

ఈతని కుమారుడు విజయరాఘవుడు ఈతడు తండ్రిని మించిన ఆంధ్ర నాట్యకళాపోషకుడు. ఇతడు అనేక యక్షగానాలు వ్రాశాడు. వాటిలో చెప్పుకో దగిన మేటి యక్షగానం 'రఘునాథాభ్యుదయం.' ఈ యక్షగానంలో ఆతడు తన తండ్రి రఘునాథుని జీవితాన్ని చక్కగా వర్ణించాడు. ఈతని దర్బారులో 'అష్టభాషాప్రవీణ' రంగాజమ్మ అనే గొప్ప కవియిత్రి ఉండేది. 'మన్నారుదాస విలాసం' అనే ఒక యక్షగానాన్ని ఈమె ఎనిమిది భాషలలో వ్రాసింది. ఈమె కవితను మెచ్చి విజయరాఘవుడు నిండుసభలో ఈమెను కనకాభిషేకంతో గౌరవించాడు.

నాయకరాజుల తర్వాత తంజావూరును పాలించిన శహాజీ, శరభోజీ, ఏకోజీ, ప్రతాపసింహ మొదలైనవారు మహారాష్ట్రులు. వీరు భోంస్లా వంశీయులు. వీరు మహారాష్ట్రులే అయినా, తెలుగు భాషాభిమానులు, ఆంధ్రనాట్యపోషకులు. వీరి ఆస్థానభాష తెలుగు. వీరు తెలుగు నేర్చుకొని తెలుగులో కవిత్వం కూడా చెప్పారు. యక్షగానాలు వ్రాశారు. వీరి కాలంలోనే కచ్చేరి ఆటకు ఒక నూతన

రూపం వచ్చింది. వీరి కాలంలో చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందం అని నలుగురు అన్నదమ్ము లుండేవారు. వీరు తెలుగు, సంస్కృతభాషల్లోనే కాక సంగీతశాస్త్రంలోను, భరతశాస్త్రంలోను గొప్ప పండితులు, కవులు. నేడు దక్షిణాదివారు ప్రదర్శిస్తున్న భరతనాట్యానికి ఒక క్రమాన్ని, రూపాన్ని కల్పించింది వీరే.

తంజావూరును నాయకరాజులు పాలిస్తూండిన కాలంలో ఉదయార్‌పాలెం అనే ఒక చిన్న సంస్థానాన్ని 'యువరంగ' అనే ఒక చిన్న రాజు పాలిస్తూ ఉండేవాడు. ఈతడు గొప్ప నాట్యకళాప్రియుడు. ఈతడు తమ విద్యను మెచ్చుకొంటేచాలని అనేకమంది నాట్యకళాకారులు ఈతని ఆస్థానానికి వెళ్తూఉండేవారు.

గోల్కొండను ఏలిన ప్రభువులు మహమ్మదీయులే అయినా తెలుగు భాషను, తెలుగు కవులను, తెలుగు కళలను, కళాకారులను పోషించి, ఆదరించారు. వీరి కొలువులో గొప్ప కవిగా, సంగీత విశారదుడుగా పేరుగాంచిన తులసీమూర్తి ఉండేవాడు. ఈతనితో పోటీ చేసిన పదకవిత పితామహుడు క్షేత్రయ్యను గోల్కొండ నవాబులు సమ్మానించారు. గోల్కొండ పాదుషాల దర్బారులో ప్రసిద్ధ నర్తకీమణులు తారామతి, ప్రేమావతి ఉండేవారు. ఈ కాలంలోనే 'భాగామతి' పేర భాగ్యనగరం నిర్మించబడింది. అదే నేటి హైదరాబాదు. గోల్కొండ పాదుషాల్లో చివరివాడు అబుల్ హసన్ తానీషా. ఈతడు కూచిపూడి నాట్య కళాకారులకు కూచిపూడి గ్రామాన్ని దానమిచ్చాడు.

వీరేకాక బొబ్బిలి, విజయనగరం, తుని, పిఠాపురం, పెద్దాపురం, నరసారావుపేట, గద్వాల, వేంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరం, గోపాలుపేట, సంస్థానాధీశులు కూడా ఆంధ్రనాట్యాన్ని పోషించారు.

పిఠాపురం ప్రభువులు నవజనార్దన పారిజాతాన్ని పోషించారు. కార్వేటినగర సంస్థానంలో ఉండిన గోవిందసామయ్య నాట్యానికి తగిన పెద్ద వర్ణాలను రచించాడు. విజయనగరానికి చెందిన కవులు జక్కిణీ దరువులను, శబ్ద పల్లవులను, ఇంకా అనేక నూతన అంశాలను నాట్యంలో ప్రవేశపెట్టారు.

# ఆంధ్రనాట్యం

## మూడవ సంవత్సరం

## ప్రాయోగికం

1. **పదవర్ణం : ఒకటి**
   1. తోడి రాగంలో "దానికె తగు జాణర" లేక
   2. శంకరాభరణ రాగంలో "మనవి చేకొని రార"

2. **పదాలు : రెండు**
   1. నేనే జాణ — నే చిన్నదాన
   2. వారిజముఖి నీవు వచ్చే వేళను

3. **జావళీలు : రెండు**
   1. మధురా నగరిలో
   2. మావల్ల గాదమ్మ దేవి యశోద

4. **దశావతారాలు :**

   1. మారంపల్లి సోదరీమణులు వైదేహి, ఇందువదనలు ప్రదర్శించినవి లేక కోసనీసు వారివి.

5. **తరంగం : ఒకటి**
   1. నీలి మేఘ శరీర నిత్యానంద దేహి
      (యతి నారాయణ తీర్థులవారు రచించినది)

# ఆంధ్రనాట్యం

## నాల్గవ సంవత్సరం

## సిద్ధాంతం

ప్ర॥1. నాయికా నాయకులు, వారి సఖీ సఖుల పేర్లు చెప్పండి.

స॥ **నాయికలు** : స్వీయ, పరకీయ, సామాన్య.

వీరి సఖీజనులు : దూతి, సఖి, చేటి - వీరు ముఖ్యులు. ధాత్రీచి, ప్రాతికేసిని మొదలైనవారు.

**నాయకులు** : పతి, ఉపపతి, వైశికుడు.

ఎ) **పతి** : అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు.

బి) **ఉపపతి** : అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు.

సి) **వైశికుడు** : ఉత్తమ, మధ్యమ, అధమ.

**సఖులు** : క్రీడా సఖుడు, పీఠమర్దుడు, విటుడు, చేటుడు, విదూషకుడు.

ప్ర॥2. అష్ట విధనాయికల, వారి అవస్థల పేర్లు, వారి లక్షణాలు చెప్పండి.

స॥ స్వాధీనపతిక, ప్రోషితభర్తృక, ఖండిత, కలహాంతరిత, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, అభిసారిక, వాసకసజ్జిక - ఈ ఎనమండుగురు అష్టవిధ శృంగార నాయికలు.

**వీరి అవస్థలు, లక్షణాలు** :

**1. స్వాధీనపతిక** : తాను చెప్పినట్లు విని, తాను కోరిన రీతిని నడుచుకొను భర్త కలది.

**2. ప్రోషితభర్తృక** : భర్త దూరదేశంలో ఉండగా ఆ యెడబాటును భరించలేక విచారించేది.

3. **ఖండిత :** భర్త ప్రవర్తనను ఖండించేది.

4. **కలహాంతరిత :** పతిని దూషించి తర్వాత చింతించేది.

5. **విప్రలబ్ధ :** పతిచే మోసగించబడి, చింతించేది.

6. **విరహోత్కంఠిత :** పతి ఎడబాటుకు చింతించేది.

7. **అభిసారిక :** పతిని వెతుక్కుంటూ వెళ్ళేది లేక పతిని తన వద్దకు రప్పించుకొనేది.

8. **వాసక సజ్జిక :** తన పతికి ఇష్టమైన రీతిలో అలంకరించుకొని, ఆతని రాకకోసం ఎదురుచూసేది.

**ప్ర॥3. సాత్వికాభినయంలో సంచారులు ఎన్ని? అవి ఏవి?**

స॥ సాత్వికాభినయంలో 33 సంచారులు గలవు. అవి 1. నిర్వేదం, 2. శ్రమం, 3. దైన్యం, 4. జాడ్యం, 5. గ్లాని, 6 త్రాసం 7. శంక, 8. ఆర్తి, 9. దోషం, 10. గర్వం, 11. ఆవేగం, 12. ధృతి (ధైర్యం), 13. స్మృతి, 14. చాపల్యం, 15. ఉగ్రత, 16 అవహిత్థ, 17. త్రప, 18 విషాదం, 19. మదం, 20. ఔత్సుక్యం, 21. మతి, 22. నిద్ర, 23. మోహం, 24. విబోధం, 25. మృతి, 26. ముదం, 27. ఆలస్యం, 28. వితర్కం, 29. సుప్తి, 30. అసూయ, 31. ఆధ్యానం, 32. భ్రమం, 33. అపస్మృతి.

ప్ర॥ 3. నవరసాలను, వాటి స్థాయీ భావాలను వివరించండి.

స॥ **నవరసాలు :** 1. శృంగారం, 2. వీరం, 3. కరుణ, 4. అద్భుతం, 5. హాస్యం, 6. భయానకం, 7. బీభత్సం, 8. రౌద్రం, 9. శాంతం.

**వీటి స్థాయీ భావాలు :**

1. శృంగారం కోరికవల్ల పుడుతుంది.
2. వీరం ఉత్సాహంవల్ల పుడుతుంది.
3. కరుణ దుఃఖంవలన పుడుతుంది.
4. అద్భుతం ఆశ్చర్యంవలన పుడుతుంది.
5. హాస్యం నవ్వువలన పుడుతుంది.
6. భయానకం భయంవలన పుడుతుంది.

7. బీభత్సం విచారంవలన పుడుతుంది.

8 రౌద్రం రోషం, కోపాలవలన పుడుతుంది.

9. శాంతం శాంతివలన పుడుతుంది.

ప్ర॥5. భామాకలాపం, గొల్లకలాపాల గురించి చెప్పండి.

స॥ కలాపాలను ప్రబంధాలు, పారిజాతాలని అంటారు. ఇవి నృత్యానికి సంబంధించిన రచనలు. కలాపాలలో కథ ఎక్కువగా ఉండదు. ఒక చిన్న ఇతివృత్తాన్ని వివిధ రసాలలో, సంచారీ భావ విన్యాసాలతో విస్తృతం చేస్తారు. ప్రదర్శించడానికి అనువైనవి ఇవి. ఈ ప్రబంధాలు అతి ప్రాచీనమైనవి. జయదేవుడు సంస్కృతములో వ్రాసిన "గీత గోవిందం" భారతదేశంలో ప్రబంధ రచనలకు మూలమని పండితుల అభిప్రాయం. గీతగోవిందం తీరులోనే భామాకలాపం రచించబడింది. ఇక్కడ భామ అనగా సత్యభామ. ఈ యితివృత్తంలో సత్యభామ, శ్రీకృష్ణులు నాయికానాయకులు. వీరి ప్రేమకలహం, వీరి ఎడబాటు, సత్యభామ ఆ యెడబాటుకు బాధపడడం, తర్వాత వారిద్దరూ కలుసుకొనడం ఈ భామాకలాపంలోని ఇతివృత్తం. ఇటువంటిదే నవజనార్దన పారిజాతం. నవజనార్దన పారిజాతాన్ని పలువురు కవులు వ్రాశారు. భామాకలాపాన్ని కూచిపూడి భాగవతులకోసం సిద్ధేంద్రయోగి వ్రాశాడు.

**గొల్లకలాపం :** హైందవమతం, కులాచారాలు మొదలైన వాటిపైని వేదాంతపరంగా ఒక బ్రాహ్మణునకు, ఒక యాదవ వనితకు మధ్య జరిగిన సంవాదాన్ని గొల్లకలాపం అంటారు. ఈ సంవాదం చిన్నచిన్న పాటల రూపంలో జరిగింది. తరికొండ వెంకమాంబ అనే కవయిత్రి మొదటిసారిగా ఈ గొల్ల కలాపాన్ని వ్రాసినట్టు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. ఆ తర్వాత భాగవతుల రామయ్య మొదలైనవారుగూడ గొల్లకలాపాలు వ్రాశారు.

ప్ర॥6. తూర్పుగోదావరి జిల్లాలోని స్త్రీ కళామూర్తులు ప్రదర్శించిన నవ జనార్దన పారిజాతం గురించి తెలియచెప్పండి.

స॥ తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలోని స్త్రీ కళావేత్తలు భామా కలాపాన్ని "నవజనార్దన పారిజాతం" అన్న పేరుతో పూర్వం ప్రదర్శిస్తూ ఉండేవారు. వీరి ప్రదర్శన కూచిపూడివారి ప్రదర్శనకు భిన్నమైంది. ఇదికూడా సామాన్య

ప్రజలకోసం ప్రదర్శింపబడుతూ ఉండినా - దీనిలోని ఆట. పాటల తీరు వేరుగా ఉంది.

1. ఈ కలాపాన్ని తొమ్మిది రాత్రుళ్ళు వరుసగా కుంతి మాధవస్వామి వారి సేవలో ప్రదర్శించి, పదవరాత్రి భాగవతంలోని దశమస్కంద పారాయణతో ముగించేవారు. 9 రాత్రుళ్ళు దీనిని ప్రదర్శించేవారు గనుక దీనిని నవ జనార్ధన పారిజాతం అన్నారు.

2. తొమ్మండుగురు నర్తకీమణులు భామ వేషం వేసి, వారి వారి వాద్య బృందాలతో ఒకే రంగస్థలంపైని మూడుసార్లు ప్రదర్శిస్తే యజ్ఞం చేసినంత ఫలితం చేకూరుతుందని వారి విశ్వాసం. 9 మంది నర్తకీమణులు ఒకేసారి ఈ కలాపాన్ని ప్రదర్శించేవారు గనుక దీనిని నవ జనార్ధన పారిజాతం అన్నారు.

3. తూర్పుగోదావరి జిల్లాలో గోదావరినది ఉత్తర తీరాన నారదుడు ప్రతిష్ఠించిన 9 జనార్ధన స్వామి ఆలయాలు ఉన్నాయి. ఈ యాలయాలలో స్వామి వారి పూజలో ఈ కలాపాన్ని ప్రదర్శించేవారు. 9 ఆలయాలలో ఇది ప్రదర్శింపబడేది గనుక దీనిని నవ జనార్ధనం అన్నారు.

4. స్త్రీ దశావస్థలలో మూర్ఛ లేక మరణాన్ని రంగస్థలం మీద ప్రదర్శించ కూడదు గనుక. మిగిలిన నవ అవస్థలను - చాక్షుప్రీతి, చింత, సంస్మృతి, గుణకీర్తన, ఆర్తి, తాపము, లజ్జ, త్యాగం, గమనం - తొమ్మిది రాత్రులు ఈ కళాకారులు వేర్వేరుగా ప్రదర్శించేవారు గనుక, దీనికి నవజనార్ధనం అన్న పేరు వచ్చింది

ప్ర॥ 7. భామా కలాపాలను రచించినవారు ఎవరు?

స॥ భామాకలాపాన్ని మొదటిసారి వ్రాసినవాడు సిద్దేంద్రయోగి, కాని, ఆ రచన దొరుకుటలేదు. ప్రస్తుతకాలంలో మంగు జగన్నాథ కవి వ్రాసిన భామా కలాపాన్ని కూచిపూడివారు ప్రదర్శిస్తున్నారు. నవజనార్ధన పారిజాతాన్ని ఒక కవి వ్రాయలేదు పలువురు కవులు- నెల్లిమర్లవారు, కోరుకొండవారు, ద్వారకా తిరుమల, కేశవపురి, రంగపురి మొదలగు దేవతలకు అంకితంగా వ్రాసిన దరువులు, ద్విపదలు, పద్యాలు మొదలైనవాటిని సంకలనం చేసి నవ జనార్ధన పారిజాతంగా తూర్పు గోదావరి జిల్లా కళాకారులు ప్రదర్శిస్తూ వచ్చారు.

ప్ర॥ 8. పేరిణి శివతాండవాన్ని వివరించండి.

స॥ కాకతి గణపతి దేవుని ఆస్థానంలో గజసేనాపతిగా ఉండిన జాయప గణపతిదేవుని బావమరిది. ఇతడు గుండయామాత్యుని వద్ద నృత్యం నేర్చుకొన్నాడు. తర్వాత ఇతడు 'నృత్త రత్నావళి" అనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. ఆ కాలంలో తెలుగు దేశంలో ఉండిన అనేక నృత్యాల గురించి తన నృత్తరత్నావళి గ్రంథంలో వ్రాశాడు. ఈ నృత్తాలలో ఒకటి పేరిణి. కాకతీయ వీరులు రణరంగంలో ప్రవేశించే ముందు శివప్రేరణ కొరకు ఈ ప్రేరిణి తాండవాన్ని చేసేవారు. ఈ ప్రేరిణిలో 5 అంగాలున్నాయి. అవి 1. గర్షరం, 2 విషమం, 3. భావాశ్రయం, 4 కవివారం, 5. గీతం ఇది ప్రత్యేకంగా పురుషులు శివప్రేరణకోసం చేసే తాండవమని జాయప పేర్కొన్నారు. ఇది వీర రస ప్రాధాన్యం గలది. కనుక ఇది చాలా ఉధృతంగాను, ఉద్ధతంగాను ఉంటుంది.

ప్ర॥ 9. మనోధర్మం అంటే ఏమిటి?

స॥ గురువు వద్ద నేర్చుకొన్న విద్యను ప్రదర్శించడంతో తృప్తిపడక కళాకారుడు తన బుద్ధి కుశలతతో కొత్త విషయాలను చేర్చి, తన కళను తీర్చి దిద్దుకొని ప్రదర్శించడం మనోధర్మం.

ప్ర॥10. సిద్ధేంద్రుడు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, క్షేత్రయ్య, నారాయణ తీర్థులు, అన్నమాచార్యులు - వీరి జీవిత చరిత్రలను క్లుప్తముగా వ్రాయండి.

**1. సిద్ధేంద్రుడు :**

క్రీ.శ. 16 వ శతాబ్దిలో ఈ యోగిపుంగవుడు జన్మించాడు. శ్రీకృష్ణ సత్యభామల ప్రేమ కలహాన్ని ఈ యోగీశ్వరుడు ముచ్చటైన కలాపంగా రచించాడు. ఇది నృత్యానికి, గానానికి కూడ చాల అనువైనది. ఈయన ఈ కలాపాన్ని కూచిపూడి నృత్య కళాకారులకు నేర్పాడు. కూచిపూడి నృత్యకళకు ఈతడు మూలపురుషుడుగా భావింపబడుతున్నాడు. సిద్ధేంద్రుడు రచించిన భామా కలాపం ఎంతో ప్రఖ్యాతి చెందింది కాని, దొరకడం లేదు.

**2. క్షేత్రయ్య (1590 - 1675) :**

ఈతడు గొప్ప కృష్ణ భక్తుడు, కవి, అభినయ కళావేత్త. స్త్రీ పురుషుల-నాయికా నాయకుల ప్రేమ - వియోగాలను చిత్రిస్తూ ఈతడు ఎన్నో పాటలు వ్రాశాడు. వీటిని పదాలు అంటారు అభినయానికి ఈ పదాలు ఎంతో ముఖ్య

మైనవి. క్షేత్రయ్య పదాలు లేకుండా ఉంటే దక్షిణ భారతదేశంలో - ముఖ్యంగా ఆంధ్రదేశంలో అభినయకళ ఇంత గొప్పగా వృద్ధిచెందియుండేదికాదు. క్షేత్రయ్య పదాలు తెలియని నర్తకులు లేరు. ఇతడు గోల్కొండ, తంజావూరు, మధుర మొదలైన సంస్థానాలకు వెళ్ళి, అక్కడ కొన్ని పదాలు రచించి, ఆయా రాజుల, పండితుల ప్రశంసలను పొందాడు. ఇతడు కృష్ణా జిల్లాలోని మొవ్వ గ్రామానికి చెందినవాడు. మొవ్వలోని వేణుగోపాల స్వామివారికి అంకితంగా 4500 పదాలు వ్రాశాడు. అందువల్ల క్షేత్రయ్య పదాలను మువ్వగోపాల పదాలంటారు.

**3. నారాయణతీర్థులు :**

ఈతడు ఒక గొప్ప కృష్ణభక్తుడు, చక్కని కవి, సంగీతజ్ఞుడు. శ్రీకృష్ణుని జననం మొదలుకొని రుక్మిణీ కల్యాణంవరకు భాగవత కథను నృత్యానికి, సంగీతానికి అనుకూలించేటట్టు సంస్కృతంలో పాటలు వ్రాశాడు. ఈ పాటలను తరంగా లంటారు. సముద్రంలోని అలలులాగ ఈయన తరంగాలు వివిధ తాళ లయల్లో ఉన్నాయి. నర్తకులు నృత్త, నృత్య, అభినయాలను ప్రదర్శించుటకు ఇవి చాలా అనుకూలమైనవి.

**4. తాళ్ళపాక అన్నమాచార్యులు (1408-1503) :**

తెలుగు పద సాహిత్యానికి పట్టుగొమ్మ తాళ్ళపాక అన్నమాచార్యులవారు. ఈయన 32000 పదాలను రచించాడు. ఇవి ఆధ్యాత్మిక కీర్తనలని, శృంగార కీర్తనలని రెండు విధాలుగా ఉన్నాయి. ఈయన ఈ పదాలను 15 వ శతాబ్దిలో రచించినా, 1935 వరకు ఇవి ప్రాచుర్యంలోకి రాలేదు. ఈ పదాలను పూర్వం అభినయించి, నర్తించినట్లు కనబడదు. తిరుమల - తిరుపతి దేవస్థానంవారు ఈ పదాలను ముద్రించడం మొదలుపెట్టిన తర్వాత వీటికి విశేషమైన ప్రచారం వచ్చింది. నేటి నృత్యప్రదర్శనలలో అన్నమాచార్య కీర్తన ఒక భాగంగా మారి పోయింది.

**5. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి (1730-1780) :**

ఈయన కాళహస్తిలో ఆస్థానకవిగా ఉండేవాడు. ఈయన గొప్ప రామ భక్తుడు. సంస్కృత ఆధ్యాత్మ రామాయణాన్ని ఈయన తెలుగులో పాటలరూపంలో వ్రాశాడు. వీటిని శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అంకిత మిచ్చాడు. తెలుగునాట ఈ పాటలు పూర్వం చాలా ప్రసిద్ధిగాంచాయి. ప్రతి తెలుగు ఇంట ఈ పాటలు పాడుకొనేవారు. ఈ పాటలకు నర్తకులు నాట్యం చేసేవారు. శ్రీరాముని జననం నుండి రామపట్టాభిషేకంవరకు రామకథను ఈయన కీర్తనలతో రచించాడు.

# ఆంధ్రనాట్యం

## నాల్గవ సంవత్సరం

## ప్రాయోగికం

1. **అధ్యాత్మ రామాయణ కీర్తన (బాలకాండం)**

   i) శ్రీరామ జననం

   ii) విశ్వరూప సందర్శనం

   iii) సీతా స్వయంవరం

   iv) సీతారామ కల్యాణం

   v) పరశురామ గర్వభంగం

   పైవాటిలో ఏదో ఒకటి.

2. **క్షేత్రయ్య పదం (ఖండిత లేక విరహోత్కంఠిత)**

   i) ముందటివలె నాపై

   ii) ఇందెందు వచ్చితివిరా

   పైవాటిలో ఏదో ఒకటి.

3. **నవ జనార్దనం (బాలికలకు మాత్రం)**

   i) సత్యభామ ప్రవేశ దరువు

**పూర్వకాలం పద్ధతి :**

సత్యభామ పాత్రధారి తెరలోనికి ప్రవేశించి, అంబ ప్రార్థన ముగించిన తరువాత కాగడాలవారు రెండు ప్రక్కల నిలిచి, రెండు కాగడాలను దగ్గరగా చేర్చి, గుగ్గిలం వేసేవారు. ఆ వెలుగులో తెరను కొద్దిగా దించేవారు. సత్యభామ

పాత్ర దర్శన మిచ్చేది. (ఆ రోజుల్లో ఆమె ముఖానికి ఒక ప్రత్యేకమైన తొడుగు- **mask** - ఉండేవి. వెంటనే మళ్ళీ తెరను మీదకు ఎత్తేవారు. ప్రార్థన ముగిసిన వెంటనే తెరను పూర్తిగా తొలగించేవారు. ఆమె తన ముఖముపై నున్న తొడుగును తీసివేసి, నిజవేషంతో ఆట ప్రారంభించేది).

దధి మదనా నీవు రావయ్యా మదనా। లేక
ఆదుగో చంద్రుడు ఉదయంబాయెను। లేక

శకునాలు మంచివాయెనమ్మా! అనే దరువుతో ఆట ప్రారంభమయ్యేది.

1. భామనే సత్యభామనే।
2. భామా యని పిలుతురే॥

ఈ రెండు తెర దరువులు, వినికిడి దరువులుగా ఉండేవి. నేటి కాలంలో వినికిడి దరువు ఆటతో సత్యభామ రంగంమీద ప్రవేశించడం ఆచారంగా ఉంది.

2 ఒకా ఒకనాడు . ...... అన్న వచనానికి అభినయం.
అలనాటినుండి ........ దరువు.
ముదమున కేశవపురి ........ దరువు.



# ఆంధ్రనాట్యం

## మొదటి సంవత్సరం

## సిద్ధాంతం

ప్ర॥1. సాత్వికాభినయంలోని సంచారీ భావములు, వ్యాపారములు, చేష్టలను వివరించండి.

స॥ ఏదైనా ఒక పదాన్ని అభినయించేటప్పుడు ముందుగా ఆ పదంలోని నాయికను నిరూపించిన తర్వాత స్థాయీ భావాన్ని నిర్ధారించవలసి యుంటుంది. ఆ తర్వాత ఆ పదంలోని అర్థాన్ని హస్తాలతో చూపించాలి. ఇక ఆ పదంలోని భావాన్ని అభినయించడం సాత్వికం. ఆ పదంలోని భావం వలన మన మనసులో కలిగే అనుభూతులను, ఈ సాత్వికాన్ని వికసింపజేయడానికి, రంజింపజేయ డానికి సంచారులు ఉపకరిస్తాయి. శాస్త్రకారుల అభిప్రాయానుసారం ఈ సంచా రులు 33. ఒక్కొక్క సంచారీ భావాన్ని పలు విధాలుగా ప్రదర్శించవచ్చును. ఉదాహరణకు- నిర్వేదం, దైన్యం ఈ రెండు ఒకే విధంగా కన్పడుతున్నా ఈ రెండు ఒకటి కావు. ఈ రెండు దీనత్వానికి ఉపయోగించబడుతున్నా-ఆ దీనత్వం యొక్క తీవ్రతను బట్టి వీటిని ప్రయోగించవలసి యుంటుంది. దీనినిబట్టి అభి నయంలో తేడా వుంటుంది.

పూర్తిగా నిరాశ చెంది, దేనియందూ ఇచ్ఛ లేకపోవడం నిర్వేదం. నిర్వే దాన్ని పది విధాలుగా అభినయించవచ్చును అని శాస్త్రకారులు చెప్పారు. కాని, అభినయించేటప్పుడు ఆ పదాన్నిబట్టి, దానిలోని భావాన్ని అనుసరించి, దానికి తగిన పద్ధతులను మాత్రమే ఎన్నుకొని అభినయించవలసి యుంటుంది. అలా

అభినయించకపోతే రసాభాసము, రసభంగం సంభవిస్తాయి. అంటే కవి చెప్పిన భావంకాక దానికి వ్యతిరేకభావం కలుగవచ్చు.

పూర్తిగా ఆశ లుడుగక దైవ ప్రార్థనలతో కార్యాన్ని సాధించవచ్చుననే ఆశతో ఉండడం దైన్యం. దైన్యాన్ని అభినయించేటప్పుడు సంచారుల ప్రయోజనాన్ని గుర్తెరిగి, వాటిని ప్రయోగించవలసి యుంటుంది.

**వ్యాపారాలు :**

ప్రియుడు తన దగ్గర లేకుండా దూరంగా ఉన్నప్పుడు ఇష్టదైవ పూజలు చేయడం, సఖులతో గూడి వనవిహారం చేయడం, ప్రియుణ్ణి తలచుకొంటూ అతన్ని కీర్తించడం, సఖులతో అతనికి సందేశాలు పంపడం, మొదలైనవాటిని వ్యాపారాలు అంటారు.

[వీటిని పూర్తిగా తెలుసుకొనాలంటే డాక్టర్ నటరాజ రామకృష్ణగారి 'దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర' చదవండి.]

**చేష్టలు :**

భావం, హావం, హేల, విలాసం, మాధుర్యం, ధైర్యం, విభ్రమం, లీల, కిలికించితం, మొట్టాయితనం, లలితం, విచ్ఛిత్తి, బిబ్బోకం, విహృతం, చకితం, హసితం, కుట్టమితం, కుతూహలం - ఇవి 18 చేష్టలు

1. **భావం** - రసభావాల జ్ఞానం కలిగియుండడం.
2. **హావం** - ఈ భావాన్ని కొద్దిగా విశదీకరించడం
3. **హేల** - ఈ భావాన్ని పూర్తిగా వికసింపజేయడం.
4. **విలాసం** - ప్రియుని చూచినప్పుడు ప్రియురాలికి కలిగే తాత్కాలిక చేష్టలు.
5. **మాధుర్యం** - శృంగార సమయాలలో భూషణాదులు లేకుండానే వికాసవంతంగా ఉండడం.
6. **ధైర్యం** - అత్యంత ప్రేమతో ఉన్నా హద్దుమీరకుండుట.
7. **విభ్రమం** : ప్రియునియందు మనస్సు లగ్నమై యుండడంవల్ల ఆభరణాలను వ్యత్యాసంగా ధరించడం.

8. **లీల** - ప్రియుని అనుకరించుట

9. **కిలికించితం** - ఉలిక్కిపడడం, వెంటనే కోపగించుకొనడం లేక అశ్రు వులు రాల్చడం సంతోషించడం - వీటిని వెంట వెంటనే ప్రదర్శించడం

10 **మొట్టాయితనం** - తన యిష్టాయిష్టాలను ప్రియుడికి కథల ద్వారా తెలియచేయడం

11. **లలితం** - శరీర విన్యాసాలద్వారా తన మనస్సును ప్రియునికి తెలియ జేయడం

12 **విచ్ఛిత్తి** - ఆభరణాలు లేకపోయినా సహజ సౌందర్యంతో ప్రకాశించడం

13. **విహృతం** - క్రియల ద్వారా తన సమ్మతిని తెలియజేయడం

14. **చకితం** - (తన తెలివితక్కువతనం వల్ల) భయపడటం

15. **హసితం** - ఆనందంతో ప్రకాశించడం

16. **కుట్టమితం** - సురతానందంవల్ల దంత, నఖ క్షతాలను తెలిసికొనలేక పోవడం

17. **బిబ్బోకం** - ప్రియుని కథయందు ఆసక్తి లేకపోవడం

18. **కుతూహలం** - ప్రియుని విషయమై మోహచాపల్యం పొందుట

ప్ర॥2. దశావస్థలను వివరించండి.

స॥ నాయకుడు దగ్గర లేనప్పుడు ఆ వియోగాన్ని నాయిక అనుభవిస్తు న్నప్పుడు ఆమె అనుభవించే అనుభవాలు పది విధాలుగా ఉంటాయి. వీటినే శాస్త్రకారులు దశావస్థలన్నారు. అవి - చక్షుప్రీతి, చింత, స్మృతి, గుణకీర్తనం, ఉద్వేగం లేక అరతి, ప్రలాపం, ఉన్మాదం, గమనం, మూర్ఛ, ధన్యత.

1. **చక్షుప్రీతి** - ప్రియునికోసం ప్రీతితో ఎదురు చూడ్డం.
2. **చింత** - ప్రియుని గురించి చింతన.
3. **స్మృతి** : ప్రియుని గూర్చి స్మరణ.
4. **గుణకీర్తనం** : ప్రియుని గుణాలను కీర్తించడం.
5. **ఉద్వేగం లేక అరతి** : ప్రియుడు దగ్గర లేకపోవడం వల్ల దేనియందు ఇచ్ఛ లేకపోవడం.

6. ప్రలాపం : ప్రియుని వియోగంవల్ల తపించడం.
7. ఉన్మాదం : అధిక ప్రేమతో పిచ్చిగా ప్రవర్తించడం.
8. గమనం : ప్రియుణ్ణి వెతుక్కొంటూ వెళ్ళడం.
9. మూర్ఛ : భరింపరాని మోహంతో మూర్ఛపోవడం.
10. ధన్యత : ప్రియుణ్ణి కలుసుకొని ఆనందించడం.

దశావస్థలలో మరణాన్నికూడ కొందరు చేర్చారు. కాని, నాయిక మరణం తర్వాత మరింక కథ ఉండదు గనుక, మూర్ఛతోనే ఈ యవస్థలను కొందరు ముగించారు. (కలాపాలలోని సత్యభామ ప్రథమ మూర్ఛ, ద్వితీయ మూర్ఛ దీనికి సంబంధించినవే.)

ప్ర॥3. ఆంధ్రదేశంలోని ఆలయ. ఆస్థాన నృత్యకళాభివృద్ధిని శాసనాల ఆధారంతో వివరించండి.

స॥ కాళేశ్వరం, శ్రీశైలం, ద్రాక్షారామం - ఈ మూడు క్షేత్రాల మధ్య నుండిన ప్రాంతాన్ని త్రిలింగదేశ మన్నారు. ఇదే ఆంధ్రదేశం. అయితే, నేటి ఆంధ్రదేశం ఈ మూడు క్షేత్రాలను మించి విస్తరించింది.

**1. కాళేశ్వరం :** ఇది తెలంగాణా ప్రాంతంలోని కరీంనగర్ జిల్లాలో ఉంది ఒకే పానవట్టం మీద రెండు శివలింగా లుండడం ఇక్కడున్న ఆలయం యొక్క విశిష్టత.

**2. శ్రీశైలం :** రాయలసీమ ప్రాంతంలోని కర్నూలు జిల్లాలో ఇది ఉంది. ఇక్కడున్న శ్రీ మల్లికార్జునస్వామివారి ఆలయం చాలా ప్రసిద్ధమైనది.

**3. ద్రాక్షారామం :** ఇది తూర్పుగోదావరి జిల్లాలో ఉంది. ఇక్కడున్న భీమేశ్వరాలయం చాలా గొప్పది. ఇది దక్షుడు యజ్ఞం చేసిన స్థలంగనుక దీనిని దక్షవాటిక అనికూడా అంటారు. దక్షుని కుమార్తె దాక్షాయని పరమశివుని భార్య. యజ్ఞసమయంలో దక్షుడు తన కుమార్తెనే అవమానించాడు అప్పుడు శివుడు ఉగ్రుడై, తన జటలోనుండి వీరభద్రుని సృష్టించి, అతనిచేత ఆ యజ్ఞాన్ని నాశనం చేయించాడు. మరణించిన దాక్షాయనిని తన భుజంమీద పెట్టుకొని

శివుడు వైరివానిలాగ నాట్యం చేశాడు. ఆతని నాట్యానికి జగాలన్నీ దద్దరిల్లాయి. అప్పుడు మహావిష్ణువు తన చక్రాన్ని ప్రయోగించి, ఆమె శరీరాన్ని 18 ముక్కలుగా ఖండించాడు. అవి భారతదేశంలో 18 ప్రదేశాలలో పడ్డాయి. ఈ ప్రదేశాలనే అష్టాదశ పీఠాలుగా పెద్దలు పేర్కొన్నారు. వీటిలో ద్రాక్షారామం ఒక పీఠం. ఇదొక శక్తి పీఠంగా వెలిసింది. దీనినే మాణిక్యాంబ పీఠం అంటారు. ఆమె శివుని అర్ధాంగిగా ఇక్కడ వెలిసింది.

పూర్వం మాణిక్యాంబ అనే ఒక నర్తకి ఈ శివుని సేవలో తన జీవితం గడిపింది. అందువల్ల ఆమె దేవనర్తకి అయింది. ఆ దేవాలయంలోని దేవే ఈ నర్తకి రూపంలో జన్మించిందని ఆ ప్రాంతంవారి విశ్వాసం. ఆమె చివరకు అక్కడ శివునిలో ఐక్యమయిందట అందుకే నర్తకీమణులే గాక, గృహిణులు గూడ వారి పిల్లలకు మాణిక్యాంబ అని పేరు పెట్టుకొంటూ ఉంటారు.

ఈ యాలయంలో అనేక ప్రాచీన శాసనా లున్నాయి. వాటిని పరిశీలిస్తే ఆ కాలంలో ఉండిన నర్తకీమణుల గురించి, వారు చేసిన దానధర్మాల గురించి ఎన్నో వివరాలు మనకు తెలుస్తాయి.

ఆంధ్ర దేశంలో ఉన్న పంచ ఆరామాలలో ఇది ఒకటి. తూర్పు గోదావరి జిల్లాలోనే సామర్లకోటవద్ద కుమారారామం ఉంది. ఇక్కడున్న ఆలయంలో కదులుతున్న ఉయ్యాల మండపముంది.

పశ్చిమ గోదావరి జిల్లా, భీమవరంలో సోమారామం ఉంది. పశ్చిమ గోదావరి జిల్లాలోనే పాలకొల్లువద్ద క్షీరారామం ఉంది. ఈ యాలయ స్థంభం పైని ఒక అరుదైన అపరూప నృత్య శిల్పం, నాలుగు కాళ్ళ ప్రతిమ ఉంది. ఈ శిల్పాన్ని జాగ్రత్తగా పరిశోధిస్తే ఇదొక నృత్య భంగిమ అని తెలియగలదు. ప్రారంభ స్థానకం, ముగింపు భంగిమను ఎలా పట్టాలో తెలుస్తుంది. ఆ నాలుగు కాళ్ళ యొక్క వివిధ స్థానాలబట్టి ఈ విషయం మనం గ్రహించవచ్చును.

గుంటూరు జిల్లా ధాన్యకటకం వద్ద అమరారామం ఉంది. ఇది యొక ప్రాచీన బౌద్ధ క్షేత్రం. ఇక్కడ అమర లింగేశ్వర ఆలయ ముంది. ఇక్కడ ప్రాచీన బౌద్ధ స్థూపాలున్నాయి. ఈ స్థూపాలమీద బౌద్ధుల నాట్యరీతులు లగ

శిల్పాలు ఉన్నాయి. వీటిని పరిశీలిస్తే మన ప్రాచీన నృత్యకళ యొక్క ఔన్న త్యాన్ని మనం తెలుసుకోగలం.

ఈ యయిదు ఆరామాలలోను ప్రసిద్ధ శివాలయాలు ఉన్నాయి. శివుడు నర్తన ప్రియుడు. పూర్వం వీటిలో అంగభోగం, రంగభోగం ఉండేవి. ప్రాచీన కాలంలో ఇక్కడ ఉండిన నాట్యరీతులు నేడు లేవు. వీటిని గురించి శైవాగమ శాస్త్ర ఆధారంగా మనం తెలుసుకొనవచ్చును

**నవ జనార్దన స్వామి ఆలయాలు - నవ జనార్దన పారిజాతం :**

తూర్పు గోదావరి జిల్లాలో గోదావరి నది ఉత్తర తీరంపైని నారదుడు ప్రతిష్ఠించిన జనార్దన స్వామి ఆలయాలు తొమ్మిది ఉన్నాయి. పూర్వం ఈ తొమ్మిది ఆలయాలలోను శ్రీకృష్ణ సత్యభామల ప్రణయగాధ సత్యభామా కలాపాన్ని నృత్య పూజగా స్వామిసారి సేవలో పర్వదినాల్లో ప్రదర్శించేవారు. మండపేట, ధవళేశ్వరం, మడికి, జొన్నాడ, ఆలమూరు, కపిలేశ్వరపురం, కోరుమల్లి, కోటిపల్లి, మాచర్ల - ఈ తొమ్మిది చోట్ల జనార్దన స్వామివారి ఆలయాలున్నాయి.

శివుని ఆరాధనలో నృత్త, నృత్యాలు ప్రాముఖ్యం వహిస్తే, విష్ణుపూజలో నృత్య, అభినయాలు ప్రాముఖ్యం వహించేవి. ఆంధ్రదేశంలో ఇంకా అనేక ప్రముఖ ఆలయాలున్నాయి. వాటిలో కొన్ని:

**ముఖలింగం :** ఇది శ్రీకాకుళం జిల్లాలో ఉంది. ఇక్కడున్న ఆలయాన్ని మధుకేశ్వరాలయం అంటారు. ఇది చాలా ప్రాచీనమైనది. ఈ శివాలయంలో అనేక ప్రాచీన శాసనా లున్నాయి. చారిత్రక పరిశోధకులకు, నృత్యకళా పరిశోధకులకు ఇది చాలా ముఖ్యమైన ఆలయం. ఎందరో నర్తకీమణులు ఈ మధుకేశ్వరుని అఖండ దీపారాధన నిమిత్తం ఎన్నో దానధర్మాలు చేసినట్లు ఇక్కడున్న శాసనాలవల్ల తెలుస్తుంది. ఈ శాసనాలు ఇంచుమించు 10 వ శతాబ్దికి చెందినవి.

దేవనర్తకీమణులను ఈ శాసనాలలో దేవగణికలుగా పేర్కొన్నారు. "దేవదాసి" అన్న పదం ఈ శాసనంలో కనబడదు.

**శ్రీకూర్మం :** ఇది శ్రీకాకుళం జిల్లాలో ఉంది. పూర్వం ఈ విష్ణుదేవుని ఆలయంలో నృత్యపూజ ఉండేది. శ్రీమతి బడే వేంకటరత్నం అనే ఒక వృద్ధ దేవగణిక సుమారు 40 సంవత్సరాల క్రితంవరకు జీవించియుండేది.

**అరిసవిల్లి :** ఇది శ్రీకాకుళం పట్నానికి అతి చేరువలోనున్న సూర్యాలయం. పూర్వం ఇక్కడ నృత్యపూజ ఉండేది.

**రామతీర్థాలు :** ఇది విజయనగరం జిల్లాలో ఉంది. పూర్వం ఇక్కడ జైన, బౌద్ధ, వైష్ణవమతాలు విలసిల్లాయి. అయితే, ప్రస్తుతం ఇక్కడ వైష్ణవమత ప్రభావమే ఉంది. పూర్వం పర్వదినాలలో విజయనగర ఆస్థాన నర్తకీమణులు ఇక్కడకు వచ్చి స్వామివారి పూజలో పాల్గొనేవారు

**ఆచంట :** ఇది పశ్చిమ గోదావరి జిల్లాలో ఉంది. ఇది శివక్షేత్రం. ఒక దేవనర్తకివల్ల ఇక్కడున్న శివునికి చంటేశ్వరుడు అన్న పేరు వచ్చింది.

**పిఠాపురం :** ఇదొక ప్రాచీన సంస్థానం. ఇదొక పుణ్యక్షేత్రం. ఇక్కడ కుక్కుటేశ్వరుడు వెలిశాడు. అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటైన పురుహూతికా పీఠం ఇది. పంచ మాధవుల్లో ఒకడైన కుంతి మాధవుడు ఇక్కడ వెలిశాడు. పాదగయ గూడా ఇక్కడ ఉంది. పిఠాపురం సంస్థానాధీశులు వెలమదొరలు. వీరు విష్ణుభక్తులు, కుంతి మాధవుని ఆరాధకులు. వీరు నృత్య కళాపోషకులు. గంగాధర రామారావుగారి కాలంలో ఇక్కడున్న కుంతి మాధవుని ఆలయంలో నవ జనార్ధన పారిజాతాన్ని పెండ్యేల వంశీయులు 9 రాత్రుళ్ళు ప్రదర్శిస్తూ ఉండే వారు. వీరి వంశంలో ఈ నవ జనార్ధన పారిజాతాన్ని ప్రదర్శించిన చివరి ప్రసిద్ధ నర్తకురాలు శ్రీమతి పెండ్యేల సత్యభామ ఈమె అమ్మమ్మ పెదసత్యభామగారు కూడా గొప్ప నృత్య కళావేత్త. చిన్నసత్యభామగారు సుమారు 70 సంవత్సరాలు ఈ పారిజాతాన్ని ప్రత్యేకంగా కుంతి మాధవుని ఆలయంలో ప్రదర్శించారు. ఈమె గొల్లకలాపంలో గూడ దిట్ట. అయితే, ఈమెకు భామాకలాపం యెడల మక్కువ ఎక్కువ ఉండేది ఈమె సుమారు 30 సంవత్సరాలక్రితం మరణించారు.

పిఠాపురం సంస్థానంలో కోనె వేంకటరత్నం అనే ఒక ప్రసిద్ధ నర్తకి ఉండేది. ఈమె ఉప్పాడ గ్రామస్థులు వానకం మల్లయ్యగారి వద్ద 7 రాత్రుళ్ళ కలాపాన్ని అభ్యసించి, రాజావారికోటలో ప్రదర్శిస్తూ ఉండేవారు. ఈమ మనుమ రాలు కోనె చిట్టిరాజు పైరెంకు కలాపాల్ని ప్రదర్శించేవారు. సుమారు 20 సంవత్స రాలక్రితం ఈమె మరణించింది. ఈమె కుటుంబంవారు పిఠాపురం 'జీవ ఎరుకల కురవంజి' అనే ఒక అద్భుతమైన అరుదైన వేదాంత పరమైన గ్రంథాన్ని ప్రదర్శించే వారు. ఈ గ్రంథాన్ని ఉప్పాడ ఆచార్యుల వారు రచిం చారు. ఈ విద్య మరెవ్వరికీ అబ్బలేదు. ఈ గ్రంథం అచ్చుకాలేదు. అయితే, డాక్టర్ నటరాజ రామకృష్ణగారు 20 సంవత్సరాల క్రిందట ఈ గ్రంథ వ్రాత ప్రతిని కనకం నాగన్న దాసుగారినుండి సేకరించి, ప్రచురణ నిమిత్తం ఆనాటి సంగీత నాటక అకాడమీకి బహూకరించారు. కాని, అది అచ్చుకు నోచుకోలేదు. ఆ ప్రతి ఏమైందో తెలియదు.

దువ్వా సూర్యకాంతం, అమ్మాణీ కుటుంబాలవారు కచ్చేరి, కర్నాటక ఆటలను పండిత సభల్లోను, ఉత్సవాలలోను ప్రదర్శించేవారు. పెద్ద పరాంకుశం వంశంవారు మాధవుని సేవలో నృత్యపూజ చేసేవారు. వీరి వంశంలో చివరి నర్తకి చిన్న పరాంకుశం.

తూర్పు గోదావరి జిల్లాలోని నర్తకీమణులు దేవతల కోసం నృత్యపూజలు; రాజుల కొరకు, పండితుల కొరకు కచ్చేరి ఆట; సామాన్య ప్రజలకోసం పారి జాతాలు ప్రదర్శిస్తూ ఉండేవారు. ఈ మూడు రకాలైన లాస్యం ఈ జిల్లాలో బహుళ ప్రచారంలో ఉండేది.

తూర్పు గోదావరి జిల్లా ర్యాలిలోని మోహినీ కేశవమూర్తి ఆలయంలోను, పలివెల కొప్పేశ్వర ఆలయంలోను, మురమళ్ళ నిత్యకల్యాణ వీరేశ్వరాలయం లోను నిత్యం నృత్య పూజ ఉండేది.

పలివెల కొప్పేశ్వరుని గురించి ఒక చిత్రమైన కథ ప్రచారంలో ఉంది. పూర్వం పలివెలలో ఒక ప్రసిద్ధ నర్తకి ఉండేది. ఆ గుడి పూజారి ఆమె ప్రేమలో పడి, స్వామి వారికి అర్పించవలసిన పూలమాలలను ముందుగా ఆమెకు అలంక రించి, తర్వాత ఆ మాలలతో స్వామిని అలంకరించేవాడు. ఆ మాలల్లో

వెంట్రుకలు ఉండడం చూసి, కొందరు ఆ వూరు రాజుకు ఫిర్యాదు చేశారు. రాజు ఆ పూజారిని పిలిచి అడగ్గా "ప్రభూ! మన ఈశ్వరునికి కొప్పు మొలిచింది. అందువల్ల పూలమాలల్లో వెంట్రుకలుంటున్నాయి'' అని పూజారి సమాధానం చెప్పాడు. రాజు, ఆ మర్నాడు గుడికి వచ్చి, ఈ విషయం పరీక్షిస్తానన్నాడు. అందువల్ల ఆ రాత్రి ఆ పూజారి తన తప్పును మన్నించి, కాపాడమని ఆ పరమేశ్వరుని వేడుకొన్నాడు. మరునాడు ఆ రాజు పరీక్షించినప్పుడు, ఆ ఈశ్వరునికి కొప్పు మొలిచి ఉంది! అందువల్ల ఇక్కడి ఈశ్వరుడు కొప్పేశ్వరుడైనాడు. ఇక్కడ పూర్వం శైవ రీతి నాట్యాలుండేవి.

**మాచర్ల చెన్నకేశ్వర, వీరభద్ర ఆలయాలు :**

శివకేశవులు ఒక్కరే అని ప్రబోధించిన బ్రహ్మనాయుని మత సిద్ధాంతానికి ప్రతీకలు ఈ యాలయాలు. "చంద్రవంకనదిలో స్నానం, చెన్నకేశుని సందర్శనం, చంద్రముఖి నాట్యం - ఈ మూడింటిని సేవించనిదే తీర్థయాత్ర పరిపూర్ణంకాదు" అని ఒక నానుడి ఉంది. అంటే, చంద్రముఖి అంత ప్రసిద్ధమైన నర్తకి అన్నమాట.

**నెల్లూరు రంగనాయకులు :**

"పెన్నదాటితే పెరుమాళ్ళసేవ" అని పూర్వం పెద్దలు అనేవారు. పెన్న ఒడ్డున శ్రీ రంగనాయకుల స్వామివారి ఆలయ ముంది. ఇక్కడ పూర్వం నృత్యపూజ జరిగేది. పెంచెలకోన నరసింహస్వామి వారి ఆలయంలో గూడ నృత్యపూజ ఉండేది. ఈ గుడిలో కలువాయి గ్రామస్తురాలు గుడిగుంట నాగమణి నృత్యపూజ చేసేది. ఈమె కాళహస్తికి చెందిన నాయుడుపేట రాజమ్మగారి ప్రథమ శిష్యురాలు. ఈమె కర్నాటక, ఆలయ సంప్రదాయాలలో ప్రసిద్ధి గన్నది.

**బాపట్ల భావనారాయణస్వామి ఆలయం :**

ఈ యాలయంలో పూర్వం నృత్యపూజ ఉండేది. మల్లమ్మ ఈ యాలయంలో నర్తకిగా ఉండేది. ఈమె కుమార్తె లకుమ కర్పూర వసంతరాయలు బిరుదాంకితుడైన కొమరగిరి కొండవీటి రెడ్డి ప్రభువు కొలువులో ఆస్థాన నర్తకిగా ఉండేది,

**శ్రీ కాళహస్తి :**

శ్రీ కాళహస్తి ప్రసిద్ధ శైవ క్షేత్రం. ఈ శివాలయంలో నిత్యం శైవాగమ పద్ధతిలో నృత్యపూజ, కేళికలు జరుగుచుండేవి.

భరతాభినయాలలో ప్రసిద్ధిగన్న శ్రీమతి నాయుడుపేట రాజమ్మ ఈ యాలయంలో ప్రసిద్ధ నర్తకిగా ఉండేది. సుమారు 40 సంవత్సరాల కిందట కడు వృద్ధాప్యంలో ఈమె గతించింది.

విజయనగర రాజుల కాలంలో తిరుపతిలో ఎందరో నర్తకీమణులుండి నట్లు, వారెన్నో దానధర్మాలు చేసినట్లు కొన్ని శాసనాలవల్ల తెలుస్తున్నది.

**అహోబిలం :**

ఇది ఒక ప్రసిద్ధ వైష్ణవక్షేత్రం. విష్ణు కథలను నృత్యనాటకాలుగా ఇక్కడి భాగవతులు పర్యటిస్తూ ప్రచారం చేశారు.

**శ్రీకాకుళం - ఆంధ్రవిష్ణు ఆలయం :**

కృష్ణాజిల్లా, దివిసీమలో గల ఈ యాలయం చాలా ప్రాచీనమైనది. ఇక్కడ అనేక శాసనాలు ఉన్నాయి. ఈ యాలయంలో నృత్యపూజ యుండి నట్లు ఈ శాసనాలవలన తెలుస్తున్నవి సుమారు 20 సంవత్సరాల క్రితంవరకు వృద్ధులైన దేవనర్తకీమణులు ఇక్కడ ఉండేవారు.

**బాసర సరస్వతీదేవి ఆలయం :**

భారతదేశంలో సరస్వతీదేవి ఆలయాలు బహుతక్కువగా ఉన్నాయి. అందులో ఒకటి ఆదిలాబాద్ జిల్లాలోని బాసరలో ఉంది. దీనిని వ్యాసమహర్షి ప్రతిష్ఠించాడని ప్రతీతి. అందుకే ఇది బాసర అయింది. ఇక్కడ ఈ దేవి నిత్య పూజలో నృత్యపూజ ఉండేది. కొద్దికాలం క్రిందటివరకు ఒక వృద్ధ నర్తకి నృత్య పూజ నిర్వహిస్తూ ఉండేది. ఆమె గతించిన తర్వాత నృత్యపూజ ఈ దేవికి మరి లేకుండాపోయింది.

ఇవిగాక నృత్యపూజలు జరుగుచుండిన ఆలయాలు మరెన్నో మన ఆంధ్ర దేశంలో ఉన్నాయి. అన్నిటి గురించి వ్రాస్తే అదొక పెద్ద గ్రంథమౌతుంది.

కోనసీమ వేద పండితులకు కాణాచి విశ్వేశ్వర అగ్రహారం ఇక్కడ ఒక శివాలయ ముంది. ఈ యూరు చిన్నదే అయినా బ్రాహ్మణ వేదపండితులకు, సంగీత, నృత్య కళాకారులకు ప్రసిద్ధిగన్న ఊరు ఇది.

ఇక్కడి విశ్వేశ్వరునికి జరుగుచుండిన కల్యాణమహోత్సవంలో అయిదు రోజులు నృత్యకేళికలు జరుగుతూ ఉండేవి. వేదశాస్త్రోక్తరీత్యా సంగీత, నాట్య అభినయకళలందు సంపూర్ణ విజ్ఞానంగల నర్తకీమణులు మాత్రం ఈ కేళికలలో పాల్గొనడానికి అర్హులై ఉండేవారు. వీరు ధనార్జనకుకాక పండితుల ప్రశంసల కొరకు ఈ ప్రదర్శనలలో పాల్గొనేవారు. ఈ యైదు రోజుల ఉత్సవంలోను 5 ప్రత్యేక వర్ణాలను, పదాలను, జావళీలను ఈ నర్తకీమణులు అభినయించేవారు. ఈ కళాకారులలో ప్రఖ్యాతిపొందినవారు ముమ్మడివరం అన్నాబత్తుల వంశీయులు. దేవాలయాలలో నృత్యపూజ అంతరించినా ఈ వంశానికి చెందిన ప్రసిద్ధ నర్తకి అలివేలుమంగతాయారు ప్రాచీన సాంప్రదాయానుసారం ఆలయపూజలో పాల్గొంటున్నారు.

విజయనగరం రాజుల కాలంనాటి సుందర నృత్య శిల్పసౌందర్య శోభితాలైన లేపాక్షి శివాలయంలోను, నాగలాపురం విష్ణు ఆలయంలోను పూర్వం నృత్యపూజ ఉండేది.

## సంస్థానాలు

**విజయనగరం :** విద్యల నగరం విజయనగరం. పూర్వం ఈ సంస్థానానికి అధిపతిగా నుండిన ఆనందగజపతి ఆంధ్రభోజుడుగా ప్రసిద్ధి పొందాడు. వీరి కాలంలో సంగీత నృత్యకళలు బాగా పోషింపబడ్డాయి. సంగీతంలో ఉత్తరాది, దక్షిణాది కళలు రెండు సమంగా ప్రోత్సహింపబడ్డాయి. విజయనగర ఆస్థాన నర్తకీమణులు పూరీ జగన్నాథస్వామివారి రథోత్సవాలలో పాల్గొని కేళికలు ప్రదర్శించేవారు. అంతేకాదు-వీరు గంజాం, కొరాపుట్టి జిల్లాలలోని అనేక జమీందారులు వీరిని నృత్యకేళికలకోసం ఆహ్వానించేవారు. జయపురం మహారాజా విక్రమదేవవర్మగారి పట్టాభిషేక మహోత్సవంలో విజయనగరం, బొబ్బిలి నర్తకీమణులు పాల్గొని, తెలుగు పాటలకు ఒరియా అనువాదాలను వ్రాయించి, అభినయించి, మహారాజావారి మన్ననలను పొందారు. శ్రీమతులు మద్దెల అప్పడు,

రాముడమ్మ, సన్యాసమ్మ ఆనాటి ప్రముఖ గణికలు. శ్రీ అప్పలరాజు విజయ నగర సంప్రదాయాలలో ప్రసిద్ధురాలు. ఈమె ప్రభుత్వ సంగీక పాఠశాలకు ప్రిన్స్‌పాల్ పనిచేసి, పదవీ విరమణ చేసి, విజయనగరంలో విశ్రాంతి తీసు కొంటున్నారు.

విజయనగరం నాట్య సంప్రదాయం అభ్యసించడానికి బరంపురం, కాకి నాడ మొదలైన పట్నాలనుండి ఆ కాలంలో నర్తకులు వస్తూండేవారు.

**తుని :**

తుని జమీందారులులు నృత్యకళనుపోషించి ప్రోత్సహించారు. ఈ సంస్థా నంలో చంద్రవదన అనే ప్రఖ్యాత నర్తకి ఉండేది. పెద్దాపురం సంస్థానం అంత రించిన తర్వాత రాజులు తునికి వలస వెళ్ళారు.

**పెద్దాపురం :**

నాలుగు దశాబ్దుల క్రితం వరకు పెద్దాపురం సంస్థానం నాట్యవిద్యను పోషించింది. అందువలన పెద్దాపురం నాట్యమేళాలను ఇతర ప్రాంతాలవారు ఆహ్వానించేవారు వీరు ఊరేగింపులలోను, పండిత సభల్లోను కచ్చేరీలు చేస్తూ ఉండేవారు. కనుక, వీరిని గురించి కొంత చెప్పడం అవసరం.

పెద్దాపురం మేళంలో సుమారు పదిమంది సుందరాంగులు పాల్గొనేవారు. వీరికి ఒక విద్వాంసురాలు నాయకురాలుగా ఉండేది ఈ మేళానికి ఇరు ప్రక్కల వాయులీన వాద్యకులు ఉండేవారు. వెనుక శ్రుతి, నాయకురాలు, ఆమె ప్రక్కన మద్దెల వాద్యకుడు ఉండేవారు. ఇద్దరు లేక నలుగురు నాట్యం చేసే వారు. ఈ సుందరాంగులు తెల్లని వస్త్రాలు ధరించి, మల్లెపూల దండలతో జడ లను అలంకరించుకొని, బంగారు నగలు ధరించి, దివినుండి దిగివచ్చిన దేవ కన్యల్లా ఉండేవారు. ఈ అందకత్తెలకు వేరే మేకప్ అవసరముండేదికాదు. వీరు ఊరేగింపుల్లో గాస్‌లైట్ల కాంతిలో నాట్యమాడేవారు.

భాగవత కలాప కళాకారులు మాత్రం అర్దలంతో మేకప్ చేసుకొనేవారు.

మేజువాణి లేక కచ్చేరి ఆటలకు మాత్రం ఈ గణికలు బనారసు పట్టు చీరలు రంగు రంగులవి ధరించి, అలంకరించుకొనేవారు. ఊరేగింపులో ఆట సులభశైలిలో ఉండేది గాని, కచ్చేరీలలో శాస్త్రీయంగా ఉండేది.

**వేంకటగిరి సంస్థానం :**

"చర్మకట్టు వాయిద్య నర్తనం" అనే విశిష్టమైన నాట్యపద్ధతి వేంకటగిరి సంస్థానంలో ఉండేది. దసరా నవరాత్రుళ్ళలో జరిగే ఊరేగింపులలో దీనిని ప్రదర్శించేవారు. ఆస్థానంలో నర్తకీమణులు కేళికలు చేస్తుండినా ఈ చర్మకట్టు వాయిద్య నర్తనం ప్రదర్శింపబడుతూండేది. సుమారు నలభైమంది డోలు, సన్నాయి వాద్యకులు రహదారికి ఇరుప్రక్కల బారులు తీర్చి, వారి వాయిద్యాలను వాయిస్తూండగా వారి మధ్య సుమారు నూరు మంది నర్తకీమణులు తెల్లని వస్త్రాలు ధరించి, కార్వేటి నగర గోవిందసామయ్య మోహన పెద్ద వర్ణానికి ఒకేసారి నర్తన మాడేవారు.

ఆ వాద్యగోష్ఠి, ఆ నర్తనం ఇంద్ర సభలో జరుగుతున్నదా, కైలాసమే అక్కడకు కదలి వచ్చిందా అన్నంత అద్భుతంగా ఉండేది.

ఈ సంస్థానాధిపతి బంగారేచ భూపాలుని పైని పదాలు రచించబడ్డాయి. సర్వజ్ఞ కుమార యాచేంద్రులవారు ఒక గొప్ప సదస్సును నిర్వహించారు. ఉత్తర, దక్షిణ భారతావనిలోని సంగీత, నాట్య విద్వాంసులు, పండితులు కళాకారులు ఈ సదస్సులో పాల్గొన్నారు. ఈ సదస్సులో జరిగిన చర్చల సారాంశం "సభారంజని" గ్రంథంగా తరువాత ప్రచురింపబడింది.

**శ్రీకాళహస్తి :**

శ్రీ దామెర తిమ్మభూపాలుని కుమారుడు పెద వేంకటేంద్రుడు కవి, పండిత, గాయక, నర్తక పోషకుడు. ఈయన కాలంలోనే మునిపల్లె సుబ్రహ్మణ్య కవి ఆధ్యాత్మ రామాయణాన్ని కీర్తనల రూపంలో రచించాడు. ఆంధ్రదేశంలో ప్రతి యింట స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు ఈ కీర్తనలను పూర్వం పాడుకొనేవారు,

నేడు కూచిపూడి కళాకారులు కృష్ణశబ్దంగా నాట్యం చేస్తున్న "రారా, నీవు రారా, దామెర తిమ్మేంద్ర కుమార" అనే రచన 'పెద వేంకటేంద్రుని'కి అంకితంగా వ్రాయబడినది. దీనిని కూచిపూడి వారు మార్చి,

"రారా, నీవు రారా, స్వామి రారా
యదు వంశ కులాంబుధి చంద్ర" అని ప్రాస దోషంతో కృష్ణశబ్దంగా పాడి, ఆడుతున్నారు.

కాళహస్తీశ్వరాలయంలో శ్రీమతి నాయుడుపేట రాజమ్మ ఆలయ నర్తకిగా ఉండేవారు. ఈమె భరత, అభినయ, సంగీత శాస్త్రాలలో దిట్ట. ఈమె తన జీవిత కాలంలో అనేక సంస్థానాలు సందర్శించి, తన విద్యలను ప్రదర్శించి వార్షికాలు పొందారు. సుమారు 40 సంవత్సరాల క్రితం తన వృద్ధాప్యంలో ఈమె మరణించిరి.

**కార్వేటి నగరం :**

ఇది విద్యలకు నగరం. కార్వేటి నగర రాజులు చేయని దాన ధర్మాలు లేవు. ఎందరో నర్తకులు, నాట్యాచార్యులను వీరు పోషించారు. ఇక్కడ వెలిసిన వేణుగోపాలుని పైన సారంగపాణి కవి పదాలు రచించాడు. పంచరత్నాలనే 5 పెద్ద వర్ణాలను ఈ యాస్థానంలో నుండిన గోవింద సామయ్య రచించాడు. ఇవి నృత్త, నృత్య, అభినయాలకు చాలా అనువైనవే గాని చాలా కష్టమైనవి. అందువలన వీటిని నృత్య సభల్లో సమస్యలుగా ఇచ్చేవారు తెలుగు, సంస్కృత భాషల్లో పాండిత్యమున్న; సంగీత, అభినయ షస్త్రాలలో ప్రావీణ్యమున్న నర్తకీమణులు మాత్రమే ఈ వర్ణాలను అభినయించడానికి సాహసించేవారు. వేంకట పెరుమాళ్ళు రాజేంద్రునికి అంకితంగా వీటిని గోవింద సామయ్య రచించాడు.

**గద్వాలు :**

గద్వాలు రెడ్డిరాజుల జమీందారి. గద, వాలు వీరి పతాక చిహ్నం. అందుకే వీరి రాజధాని గద్వాలయింది. వీరి సంస్థానంలో రామలక్ష్మి, పుల్లసాని మొదలైన నర్తకీమణులుండేవారు. నర్సారావుపేట జమీందారి ప్రాంతం నుండి పూల మహలక్ష్మి, ఆమె శిష్యురాండ్రు ఇక్కడకు వచ్చి గద్వాల్ రాజదర్బారులో నాట్య ప్రదర్శనలు ఇస్తూవుండేవారు.

''ప్రొద్దు పోయెను చాల
పోయి వత్తుర సామి
ముద్దిడి పోసీయరా
రాజశ్రీ రామభూపాలదేవ'' అన్న ఈ పదం యాస్థాన నర్తకీమణుల అభిమాన పదం.

ప్ర॥ 4. కాకతీయ ప్రభువుల కాలంలో నృత్యకళకు జరిగిన సేవను వివరించండి.

స॥ కాకతీయ ప్రభువుల కాలంలో నృత్యకళకు జరిగిన సేవ గురించి తెలుసుకొనాలంటే ఆ కాలంనాటి ఆలయాలు, మత, సాంఘిక వ్యవహారాల గురించి చర్చించిన గ్రంథాలను చదవవలసి యుంటుంది. ఈ పరిశీలనకు తగిన గ్రంథాలు 1. పండితారాధ్య చరిత్ర, 2. బసవపురాణం, 3. విద్యానాథుని ప్రతాపరుద్రీయం, 4. జాయప రచించిన ''నృత్త రత్నావళి'' ముఖ్యమైనవి.

శైవ మతానుసారమైన పూజా విధానాలు, ఈ పూజలతో ఒక భాగంగా నుండిన నృత్య పద్ధతులను ఈ గ్రంథాల ఆధారంగా తెలుసుకొనవచ్చును. ఆ కాలంలోను, అంతకు ముందు ఉండిన మార్గ, దేశీ నృత్య రీతులను గురించి జాయప తన నృత్తరత్నావళిలో కొంత తెలియజేశాడు. కాని, వాటిని సాధన చేసే పద్ధతులను వివరించే సంప్రదాయం వ్యాఖ్యాన గ్రంథాలు మనకు లభ్యం కావడం లేదు. శిష్యులకు గురువు ప్రసాదించే 'నిధి' సంప్రదాయ వ్యాఖ్యానం. ఈ వ్యాఖ్యానంలో వంశపారంపర్యంగా వచ్చిన పూర్వుల ప్రయోగ పద్ధతులు, వారి అనుభవాలు, సాధన రీతులు మొదలైనవన్నీ ఉంటాయి. ఇవి గురువు యొక్క వ్యక్తిగత రహస్యాల వంటివి.

అందువల్ల అవి నాట్యశాస్త్రిల్లో ఉండవు. శాస్త్రానుసారం అభివృద్ధి చెందిన సంప్రదాయాలను, ఆయా గురువుల అనుభవాలతో జతచేసి ఈ వ్యాఖ్యానాలు రచింపబడుతూ ఉంటాయి. ఇటువంటి ప్రయోగ వ్యాఖ్యానాలు మన దేశంలో ఎక్కడా కనిపించడంలేదు. అనేక రాజకీయ, మత, సాంఘిక కారణాలవల్ల ఇవన్నీ నాశనమయ్యాయి. అయితే, మనకు లభ్యమౌతున్న కావ్యాలను, రచనలను, శిథిలమైయున్న ప్రాచీన ఆలయ శిల్పాలను పరిశోధించి, పరిశీలించి, వీటిని సమన్వయపరచుకొని, వీలైనంతవరకు మనం మన కళారీతు

లను పునఃసృష్టి చేసికొనాలి. అయితే, ఇదంత సులభమైన కార్యం కాదు. కళల యొక్క మూలసూత్రాలను, శాస్త్రం, సంప్రదాయాలను క్షుణ్ణంగా తెలిసికొని, వాటిని ఊహించి చూడగలిగిన వారికే ఈ కార్యం సాధ్యమౌతుంది. వీటిని ఊహించి చూడడానికి ఆ నాటి దేవాలయశిల్పాలే ముఖ్యమైన ఆధారాలు.

ఆనాటి ఆలయాల నిర్మాణం, వాటిలో శిల్పాలు, నృత్య వేదికలు మొదలైన వాటిని నిశితంగా అధ్యయనం చేయగలిగితే మన ప్రాచీన నృత్య రీతులను తెలుసుకొనడానికి వీలవుతుంది. ఇటువంటి అధ్యయనానికి వీలుపడే ఆలయాలు - పాలంపేటలోని రామప్పగుళ్ళు, ఘనపురంలోని శిథిల ఆలయ సముదాయం, హనుమకొండలోని వేయిస్తంభాలగుడి, వరంగల్ కోటలోని శిథిల శిల్పాలు. ఇవేకాక తెలంగాణా ప్రాంతంలో మారుమూల గ్రామాలలో మరుగున పడియున్న శివాలయాలు ఎన్నో ఉన్నాయి. వీటిని ప్రత్యేకంగా సందర్శించి, పరిశోధించాలి.

కాకతీయ రాజులు అభిమానించి, ఆదరించిన అనేక దేశీ (ప్రాంతీయ) నాట్యాలు నేడు లేవు కాని, వాటిపేర్లు కొన్ని గ్రంథాలలో మిగిలియున్నాయి.

ప్ర॥ 5. పేరిణి యొక్క అయిదు అంగాలను వివరించండి.

స॥ 'పేరిణి' నర్తనం **1.** గర్షరం, **2.** విషమం, **3.** భావాశ్రయం, **4.** కవివారం, **5.** గీతం అనే అయిదు అంగాలు గలది. వాటి వివరణ—

**1. గర్షరం :**

నాట్యంలో అనేక విధాలుగా గజ్జెలను కదిలిస్తూ ఆడడం గర్షరం. పట వాటం, పటనం, సూరివట్టెం, లకాదిమి, సిడిబిరం, హలబిడం అని గర్షరం ఆరు విధాలైనది.

నాట్యారంభంలో నర్తకులు సమపాదంలో నిల్చొని, తర్వాత కాళ్ళను పలువిధాలుగా కదిలిస్తూ కింకిణులను పలువిధాలుగా ధ్వనింపజేస్తూ ఆడతారు. పేరిణి పాదవిద్యాసానికి ఈ యడుగు క్రమమే మూలం. దీనిలోనుండే వివిధ అడుగులు, అడవులు, చారీరేచకాలు రూపొందుతాయి. ఈ క్రమాన్నే మేళప్రాప్తి లేక మేళవింపు అని అంటారు.

2. విషమం :

ఆకాశచారి, భూచారి విన్యాసాలు, వివిధ రకాలైన మృదంగ జతులు గల నర్తన మిది. ప్రతి విన్యాసం ఆకాశచారితో ప్రారంభమౌతుంది. ఒక జతి విన్యాస ప్రదర్శన తర్వాత తీర్మానంతో ఇది ముగుస్తుంది. నాట్యంలో తీర్మానాన్ని మూడుసార్లు ఆడి ముగించడం ఆచారం. కాని, పేరిణిలో అయిదుసార్లు ఆడి ముగించడం సంప్రదాయం. ఈ విషమాన్ని ప్రత్యేకంగా లయాశ్రిత నృత్యంగా పేర్కొనవచ్చును.

3. భావాశ్రయం :

ఇది లయ విన్యాసాన్ని తెలియజేసే నృత్తమే కాక, భావ ప్రకటనకు అనువైన భంగిమలుగల నృత్యం.

4. కవివారం :

దైవ, లేక ప్రభువుల పరమైన స్తోత్రాలు గల నృత్య మిది.

5. గీతం :

ప్రబంధ గీతాలను ప్రదర్శించే నృత్య మిది.

ప్ర॥ 6 జయదేవుడు, క్షేత్రయ్య, సారంగపాణి, సభాపతయ్య-వీరి జీవిత చరిత్రలను సంక్షిప్తంగా చెప్పండి.

స॥ జయదేవుడు : రాధామాధవుల ప్రణయాన్ని ఒకదివ్య ప్రబంధంగా రచించి, లోకానికి అందజేసిన కృష్ణభక్తుడు జయదేవుడు. ఇతడు గొప్ప కవి, సంగీతజ్ఞుడు. ఇతడు రచించిన ఈ ప్రబంధాన్ని "గీతగోవిందం" అంటారు. దీనిని ఇతడు సంస్కృతంలో రచించాడు. భారతదేశంలో మిగిలియున్న ప్రాచీన సంగీత, నృత్య ప్రబంధం ఇదొక్కటే. ఇతడు పూరీలోని జగన్నాథుని భక్తుడు ఈ జగమంతటికీ ఈ జగన్నాథుడే నాథుడు (పరమాత్ముడు). మిగిలిన జీవకోటి అంతా స్త్రీ రూపమని మధుర భక్తి ఉపాసకుల నమ్మకం. ఈ నమ్మకం పూర్తిగా గలవాడు జయదేవుడు. ఇతడు అష్టపదులను (గీతాలను) వ్రాసి, ఇతని భార్య పద్మావతి ఈ అష్టపదులకు నాట్యంచేసి, ఆ జగన్నాథుని ఆరాధించి

తరించారు. ఈ పద్మావతి తెలుగుదేశం నుండి పూరి వెళ్ళి, జయదేవుని వివాహ మాడి అక్కడ స్థిరపడినందువల్ల ఈమె తెలుగువారి ఆడపడుచు అని పండితులు అభిప్రాయపడుతున్నారు.

**క్షేత్రయ్య, సభాపతి, సారంగపాణి :**

ఆంధ్ర మహాభారతాన్ని రచించిన నన్నయ, తిక్కన ఎఱ్ఱాప్రెగడ కవిత్రయంగా ఎలా ప్రసిద్ధికెక్కారో త్యాగయ్య, దీక్షితారు, శ్యామశాస్త్రి ఎలా సంగీతమూర్తిత్రయంగా పేరుగాంచారో అలాగే క్షేత్రయ్య, సారంగపాణి, సభా పతి పదకర్తృత్రయంగా పేరు పొందారు.

ఈ ముగ్గురు గోపాలుని భక్తులే. నృత్య, అభినయాలను లెస్సగా గుర్తెరి గిన సంగీతజ్ఞులు వీరు. ఈ ముగ్గురు కవులు వేలాది పదాలను రచించి, అభినయ నృత్యకళ ఆంధ్రదేశంలో విలసిల్లడానికి ఎంతగానో దోహదం చేశారు. వీరిలో ముఖ్యంగా క్షేత్రయ్య లేకుంటే దక్షిణ భారతదేశంలో సాత్విక, శుద్ధ సాత్విక అభినయాలు ఇంత విశిష్టంగా అభివృద్ధిచెందియుండేవి కావు.

ప్ర॥ 7. అంగశుద్ధి, ఒడ్డోలగం అంటే ఏమిటి? వివరించండి.

స॥ i) **అంగశుద్ధి - ఆంగికశుద్ధి :** నృత్తం, నృత్యం, అభినయాలలో నర్తకికి నాట్యాచార్యుడు సంపూర్ణంగా శిక్షణ ఇచ్చిన తర్వాత ఒక ప్రసిద్ధ వృద్ధ నర్తకీమణి వద్దకు తన శిష్యురాలిని తీసికొనిపోయి, ఆమెచేత నాట్యమాడించి, ఆమె ఆటపాటలను ఆ వృద్ధ నర్తకీమణి చేత తీర్చి, దిద్దించేవాడు. ఇదే అంగ శుద్ధి లేక ఆంగిక శుద్ధి,

**ii) ఒడ్డోలగం :**

నర్తకుడు నృత్త, నృత్యాల శిక్షణను ముగించిన తర్వాత భారత, భాగ వతాది పురాణాలలోని ప్రముఖ పాత్రలకు ఏ విధంగా రంగస్థలంపైని ప్రాచీన సంప్రదాయానుసారం నృత్యం ప్రదర్శించాలో, ఏయే పాత్రకు ఏ విధంగా హస్త పాద విన్యాసాలు (భ్రమరాలు, రేచికాలు, ప్లవనాలు మొదలైనవి) ప్రదర్శించాలో చెప్పేవారు. వీటిని మాత్రమే నర్తకులు ఆ పాత్రపోషణలో ప్రదర్శించేవారు. కొన్ని సందర్భాలలో భాగవత ప్రదర్శనకు ముందు ప్రతి పాత్రధారి వచ్చి, తన

పాత్రను ప్రదర్శించడంలో [నాట్యమార్గంలో] తన సామర్థ్యాన్ని ప్రదర్శించేవాడు. ఆ తర్వాత కథలోని పాత్రను అనుసరించి నర్తకుడు ఆడేవాడు. ఈ ఒడ్డోలగం పూర్వం అన్ని ప్రాంతాలలోను ఉండేది కాని, ఇవి రెండు నేడు అదృశ్య మయ్యాయి.

## ప్రాయోగికము

1. **అష్టపది** - ధీరసమీరే లేక యాహిమాధవ.
2. **పాదాభినయము** - కలహాంతరిత - వివరింపుమ్మ
   ఖండిత - ఇంటికిరానిచ్చేనా
   ఇందెందువచ్చితివిరా ?
   ప్రోషితభర్తృక - భామరో ఊరికి.
3. **నవ జనార్దనం** - (బాలికలకు)
   a) సత్యభామ కృష్ణుని పేరు చెప్పుట :
   పద్యం - ఇంద్రనీలపు డాలు.
   b) సత్యభామ కృష్ణుని వెదుకుచు వెళ్ళుట :
   గీతం - ఈ దారినేమైన వచ్చేనా
   c) మన్మథోపాలంబన :
   పద్యం - చిలుకలఁడాసి
   దరువు - ఎవరే ఎదుటవచ్చేవారు.
4. **పేరిణి** - (బాలురకు)
   త్రైవారగీతాలు - శివపంచముఖ శబ్దాలు.

# ఆంధ్రధనాట్యం

## రెండవ సంవత్సరం

## సిద్ధాంతం

ప్ర॥1. భామాకలాపంపైని జయదేవుని గీతగోవింద ప్రభావం గురించి తెలియ జేయండి.

స॥ జయదేవుడు గొప్ప కృష్ణభక్తుడు, మధురభక్తి ఉపాసకుడు. రాధా మాధవుల ప్రణయాన్ని, విరహవియోగాలను శృంగార దివ్యదృశ్య ప్రబంధంగా లోకానికి అందించాడు.

12 వ శతాబ్ది ప్రాంతంలో ఇతడు ఒరిస్సాలోని లక్ష్మణ సేన మహారాజు ఆస్థానంలో ఉండేవాడు. ఇతని భార్య తెలంగాణా ప్రాంతానికి చెందిన తెలుగు వారి ఆడపడుచు ఈమె బాగా నాట్యం చేసేది. జయదేవుడు వ్రాసిన పాటలకు ఈమె నర్తించేది. జయదేవుడు గొప్ప కవి, అలంకారికుడు, సంగీతజ్ఞుడు. ఈతని కవిత్వంలోని లాలిత్యం, మాధుర్యం మరి ఏ యితర కవుల గ్రంథాల లోను కనిపించదు. శృంగార ప్రబంధనాయికగా రాధను, నాయకునిగా కృష్ణుణ్ణి ఎంచుకొని ఈతడు గీత గోవిందాన్ని రచించాడు. ఈ పాటలు ప్రాచీన ధ్రువాగాన పద్ధతిలో ఛందోగాన రచనలుగా అతడు వ్రాశాడు. ఒక్కొక్క పాట ఎనిమిది చరణాలు గలది. గనుక వీటిని అష్టపదులన్నారు. ప్రాచీన పద్ధతిలో సంస్కృతంలో వ్రాయబడిన మనకు మిగిలియున్న ఏకైక రచన గీతగోవిందం.

ఈ ప్రబంధంలోని కథ చాలా చిన్నది, ఒక చిన్న ముచ్చట వంటిది. ఈ ముచ్చటను వివిధ నాయికావస్థల్లో సాత్విక సంచారులతో అలంకార శాస్త్రాన్ని సారం పెద్దగా వర్ణిస్తూ జయదేవుడు గీత గోవింద దృశ్యకావ్యాన్ని వ్రాశాడు.

ఒకనాటి సాయంత్రం ఆకాశం మేఘావృతమై యుంది. చీకటిగా, వర్షం వచ్చే సూచనలు కన్పించాయి. అందువల్ల నందుడు తన చెల్లెలు రాధను పిలిచి, చిన్నవాడైన కృష్ణుణ్ణి అతని ఇంటివద్ద దిగబెట్టి రమ్మనమని చెప్పాడు. కృష్ణుడు తన మేనత్తతో బయలుదేరడం ఈ ప్రబంధంలోని మొదటి అంశం. తర్వాత కృష్ణుడు బృందావనంలో గోపికలతో విహరించడం, ఋతువర్ణన, వివిధ నాయికలు, వారితో నాయకుడు కృష్ణుడు మొదలైనవి ఈ ప్రబంధంలో వర్ణింపబడ్డాయి.

ఆంధ్రులు సృష్టించి, అభిమానించి, ఆరాధించిన సత్యభామా కలాపంలో గూడ కథ లేదు సత్యభామ శ్రీకృష్ణుల ప్రణయ కలహం, కృష్ణుడు అలిగి వెళ్ళడం, వారి వియోగం, సత్యభామ విరహం, దూతిక రాయబారం, తర్వాత వారిద్దరి కలయిక వివిధ దరువుల్లో, పద్యాల్లో వర్ణింపబడ్డాయి. గీత గోవిందంలో నాయిక రాధ ఒక ప్రేమమూర్తయిన భక్తురాలు. భామాకలాపంలోని నాయిక సత్యభామ స్వీయ కలహాంతరిత, సౌందర్య గర్విత, ప్రగల్భ, వీర వనిత, అతి ధనవంతుడైన సత్రాజిత్తు కుమార్తె. ఇందువల్లనే శ్రీకృష్ణునకు ఎనిమిదిమంది భార్యలున్నా మన తెలుగు కవులు ఈమెనే కృష్ణునికి సంబంధించిన కథలలో నాయికగా ఎన్నుకొంటూ ప్రబంధాలను రచించారు. గీతగోవిందం, కలాపాలలో నాయికలు వేరైనా కథను నడిపించడంలో విధానం ఒకే విధంగా ఉంది.

పూర్వం గీతగోవిందాన్ని అభినయించేటప్పుడు ముందుగా "జయ జయ కవిరచిత ప్రబంధ బృందం। సమస్తరస భావన మూలకందం। నానావిధ రాగ బృందం। సర్వజనానందం! గీతగోవిందం। భరత శాస్త్రానుసారేణాభినయం" అనే చూర్ణికను చదివి, దశావతారాలను నర్తనమాడి, అటు పిమ్మట అష్టపదులను ప్రదర్శించేవారు.

ఇదేవిధంగా భామాకలాపాన్ని "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా, నాయొనర్పం బూనిన, పారిజాత ప్రబంధమునకు, శృంగార కావ్యంబునకు, నాటకాలంకారంబునకు, భావ జ్ఞానంబునకు, రాగ జ్ఞానంబునకు, తాళ జ్ఞానంబునకు, శ్రీకృష్ణ చిద్విలాసంబునకు, కథాక్రమంబు ఎట్టిదనిన ...." అని రాగయుక్తంగా చదివి ప్రారంభించేవారు.

సంస్కృత ప్రబంధంలో ధ్రువానికి ముందు శ్లోకం, ఆ శ్లోకంలోని కవి భావాన్ని ముందుగా చెప్పి, తర్వాత దాన్ని పాటపాడుతూ వివరించేవారు. అదే విధంగా తెలుగు ప్రబంధంలో గూడ పద్యం చదివి, ఆ పద్యంలోని భావాన్ని దరువులో వివరించి, ఆడేవారు.

గీత గోవిందంవలెనే మన కలాపాలలోని దరువులు నృత్త, నృత్య, అభినయాలకు అనువుగా ఉండేటట్టు రచించబడ్డాయి.

ప్ర॥ 2. ఆంధ్ర దేశంలోని నృత్య ప్రబంధాలలో సత్యభామ పాత్ర యొక్క ప్రాముఖ్యం ఎట్టిది?

స॥ సత్యభామ కున్న విశిష్టత శ్రీకృష్ణుని భార్యలలో ఇంకెవ్వరికీ లేదు. మహాభారతంలో ద్రౌపదికి, రామాయణంలో సీతకి ప్రాముఖ్యముంది. భాగవతంలో రుక్మిణి ప్రముఖవ్యక్తే అయినా సత్యభామకున్న ప్రాముఖ్యం రుక్మిణికి లేదు. సత్యభామను అభినయించడానికి గల అవకాశం ఏ యితర పాత్రలలోను లేదు. ఎందువల్లనంటే - సత్యభామ స్వీయ నాయిక, అగ్నిసాక్షిగా శ్రీకృష్ణుడు వివాహ మాడిన నాయిక. ఆమె స్వాధీనపతిక, ధనవంతుడైన సత్రాజిత్తు కుమార్తె, వాక్చాతుర్యంగల వనిత, ప్రగల్భ, వీరవనిత, సౌందర్య గర్విత. ఇన్ని లక్షణా లున్న నాయికను అలంకార శాస్త్రంలో చెప్పిన రీతులన్నింటిని ప్రయోగించి, ప్రదర్శించడానికి వీలుంది. అందువల్లనే మన కవులు సత్యభామకు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చారు.

ప్ర॥3. దరువులు, దరువులలోని వైవిధ్యాలను తెలియజేయండి.

స॥ వినికిడి దరువులు (తెరలోని దరువులు), పాత్ర ప్రవేశ దరువులు, సంవాద దరువులు, అభినయ దరువులు, మనోవేగ దరువులు, పాత్ర నిష్క్రమణ దరువులు అని ఆరు విధాలైన దరువులు ప్రధానంగా ప్రచారంలో ఉన్నాయి.

1. పాత్ర రంగ ప్రవేశం చేసే ముందు తన గురించి తెరవెనుక నుండి గానం చేస్తూ చెప్పేది వినికిడి దరువు.

2. తెరలో నుండి ఆడుతూ, పాడుతూ, అభినయిస్తూ వచ్చే దరువు ప్రవేశ దరువు.

3. రెండు పాత్రల మధ్య జరిగే సంభాషణ సంవాద దరువు

4. పాత్ర తన భావాలను, అవస్థలను ప్రేక్షకులకు పాడుతూ తెలియ చేసి, ఆ పాటకు హావ, భావాలను ప్రదర్శించడం అభినయ దరువు.

5. శరీరానికి, మనస్సుకు మధ్య గల సంఘర్షణను తెలియజేసేది మనో వేగ దరువు.

6. పాత్ర తన ఆటను ముగించి, తెరలోనికి వెళ్ళేటప్పుడు ప్రదర్శించేది నిష్క్రమణ దరువు.

ఆయా పాత్రల స్వభావం, సన్నివేశాల బట్టి ఈ దరువులకు ఉచితమైన రాగ, తాళాలు కూర్చబడతాయి. అందుకు తగినట్టుగా పాత్రధారులు ఆడి, అభినయిస్తారు.

ప్ర॥ 4. ఆట కచ్చేరి సంగీతం (దరువు సంగీతం), కర్నాటక సంగీతం (పాట కచ్చేరి సంగీతం) - వీటిని వివరించండి.

స॥ నృత్యానికి, అభినయనానికి వీలుగా ఉండే విధంగా తాళ లయల్లో ఆట కచ్చేరి సంగీతం కూర్చబడుతుంది.

గానానికి అనుకూలమైన విధంగా కర్నాటక సంగీతం కూర్చబడుతుంది.

రాగాలాపానికి, స్వరప్రస్తారానికి అనుకూలించే విధంగా కర్నాటక సంగీతంలోని నెరవులు, జాగాలు ఉంటాయి.

నృత్యానికి, అభినయానికి వీలయిన విధంగా ఆట కచ్చేరి సంగీతంలో జాగాలు ఉంటాయి.

పాట కచ్చేరిలో రాగం ప్రధానం. ఆట కచ్చేరిలో భావం, అర్థం ముఖ్యం.

ఆట కచ్చేరిలోని దరువులు లేక పాటలు పాత్ర పోషణకు అనువుగా, భావాన్ని వికసింపజేసేటట్టు ఛందస్సులు, గతి గమనాలు ఉండేటట్టు రచింప బడతాయి.

పాట కచ్చేరిలోని పాటలు (కీర్తనలు) రాగ, స్వరాల ప్రాధాన్యత కలిగి ఉంటాయి.

ప్ర॥5. ఆంధ్రనాట్యంలోని మూడు భాగాలను విశదీకరించండి.

స॥ ప్రాచీన కాలంనుండి ఆంధ్రదేశంలో వెలసిన లాస్య నర్తన రీతి ఆంధ్రనాట్యం. దీనిని విద్యావంతులైన స్త్రీ కళాకారులు ప్రదర్శించేవారు గనుక ఇది సుందరంగా, సుకుమారంగా, లలితంగా, కోమలంగా ఉంటుంది. ఇది ఏక పాత్ర నృత్యకేళిక. నృత్త, నృత్య అభినయాలను ప్రదర్శించడానికి అనువైన సంప్రదాయం గలది ఇది. ఈ సంప్రదాయంలో ఆడే నర్తకే పాడాలి.

సాధారణంగా స్త్రీల నాట్యాన్ని లాస్యమని, పురుషుల నాట్యాన్ని తాండవ మని అంటారు. కాని, ఆంధ్ర నాట్య సంప్రదాయంలో నర్తకి సభలో కూర్చుని రసభావాలను ప్రదర్శిస్తూ అభినయించడాన్ని లాస్యమంటారు, నిలబడి, తాళ లయలను అనుసరించి ఆడటాన్ని తాండవమని అంటారు.

ఆంధ్రనాట్యం మూడు రీతుల్లో అభివృద్ధి చెందింది :

i. ఆలయాల్లోని స్వామివారి సన్నిధిని పూజల్లో ప్రదర్శించే వివిధ నర్తనాలు; కుంభహారతి తర్వాత ప్రదర్శించే పుష్పాంజలి క్రమం; అష్టదిక్పాలుర ఆరాధన సమయంలో ప్రదర్శించే నృత్యాలు, భేరీపూజ, దేవతాహ్వాన నృత్యం, ప్రహరీనర్తనం.

ii. దేవుని దర్బారులో (కచ్చేరీలో) ప్రదర్శించే కేళిక.

కల్యాణ మండపంలో ఉత్సవ మూర్తులు కొలువైయుండగా పండితులు, కవులు, శాస్త్రవేత్తల సమక్షంలో పాండిత్య ప్రతిభతో నర్తకి ప్రదర్శించే నృత్యాభినయాలు.

iii. దేవుని తిరునాళ్ళకు వచ్చే సామాన్య ప్రజలకు వినోదం ద్వారా భక్తిని ప్రబోధించే పారిజాతాల ప్రదర్శనం.

పూర్వం ఈ మూడు రీతులు విడివిడిగా ప్రత్యేకంగా ప్రదర్శించేవారు. కాని, ప్రస్తుత కాల పరిస్థితులకు అనువుగా ఈ మూడు నర్తన రీతులను మేళవించి, ''ఆంధ్ర నాట్యం'' రంగ స్థలంపైని ప్రదర్శింపబడుతూంది.

i. ఆలయ పూజా క్రమం, ii. కేళికా క్రమం, iii. పారిజాత క్రమం- ఈ మూడింటిని కలిపి పూర్వం నట్టువ మేళం లేక చిన్న మేళం అనేవారు. ఈ మేళానికి నట్టువరాలు నాయకురాలుగా వ్యవహరించి, తాళాలను ధరించి, నర్తకిచే ఆడించేది.

ఆలయ పూజల్లో పాల్గొనే డోలు, సన్నాయి, తాళాలు గల మేళాన్ని పెద్ద మేళం అనేవారు.

శ్రుతి, ముఖవీణ, మృదంగం, నర్తకి గల నట్టువ మేళాన్ని చిన్న మేళం అనేవారు.

ఈ స్త్రీ నర్తకులను దేవగణిక, గుడిసాని అని అనేవారు. పూర్వం సాని అన్న పదం చాలా గౌరవనీయమైనది రాణులకు గూడ సాని అనే పేరు ఉండేది. పిల్లలమర్రి దేవాలయం కట్టించిన రాణి పేరు ఎరుకసాని అమ్మ. ఈనాడు కూడా మనం దొరసాని, మంత్రసాని, ఎరుకలసాని అన్న పదాలను గౌరవసూచకంగానే వాడుతున్నాం. 'సా' నుండి 'ని' వరకు (ఏ టు జెడ్ అన్నట్టు) సంగీతంలో సంపూర్ణ జ్ఞానం గల స్త్రీ 'సాని' అని మనం చెప్పవచ్చును.

దేవదాసి అన్న పదం పూర్వం వాడుకలో లేదు. 'దాసి' అంటే పూర్వ రాజుల వద్ద, రాణులవద్ద ఉండిన నౌకర్లు. ఈ నౌకర్లను దాసీ, అడబాప, కాసా అని పూర్వం రాజులు సంబోధించేవారు. అందువల్ల దేవనర్తకులు 'దాసి' అన్న సంబోధనకు విముఖులు.

ప్ర॥ 6. ఆంధ్ర నాట్యంలోని నవ జనార్దన పారిజాతంలోని సత్యభామ పాత్రను ప్రాయోగిక, సిద్ధాంతాల ద్వారా పరిశీలించండి.

స॥ ఆంధ్రలో ఒకప్పుడు కృష్ణకథలుగా, ఆట భాగవతాలుగా ప్రసిద్ధి చెందిన ప్రబంధాలు, పారిజాతాలు ఒక్కటే. శ్రీకృష్ణుని చరిత్రను భాగవతం అంటారు. భక్త పోతన శ్రీకృష్ణుని జీవితకథను వ్రాస్తూ "పలికెడిది భాగవత మట" అన్నాడు.

దృశ్యాలు ప్రదర్శించే కృష్ణ కథను ఆట భాగవతం అంటారు. ఆట భాగవతంలో అతి రమణీయమైన ఘట్టం కృష్ణ, సత్యభామల ప్రణయ కలహం. భాగవతంలో ఈ ప్రణయ కలహం లేకపోయినా దీనిని ఒక శృంగార ఘట్టంగా అర్వాచీన కవులు కల్పించారు. ఆలంకార శాస్త్రాన్నింతటినీ ఒక దివ్య ప్రబంధ రూపంలో ఒక దృశ్య కావ్యంగా, నృత్త, నృత్య, అభినయాలకు అనువుగా, శ్రీకృష్ణుని ఒక ప్రణయలీలగా ఆయన భక్తులు ఈ ప్రబంధాన్ని కల్పించారు.

ఆదిలో ఈ విధమైన శృంగార ప్రబంధాన్ని రచించినవారు యోగి సిద్ధేంద్రుల వారని తెలుస్తున్నది. ఆ తర్వాత ఆంధ్రదేశంలో ఇతర ప్రాంతాల లోని పలువురు కవులు ఇటువంటి రచనలు చేశారు. పండిత పామర జనరంజకంగా గాయకులు పాడగా, నర్తకులు నాట్యమాడారు.

తూర్పు ప్రాంతంలో ఈ యాటను తూర్పు భాగవతమన్నారు. ఉభయ గోదావరి జిల్లాలలో దీనిని నవ జనార్దన పారిజాతం లేక సత్యభామ కలాప మన్నారు. రాయలసీమలో దీనిని పారిజాతం అన్నారు.

నేడు సిద్ధేంద్రుని భామాకలాపం అలభ్యం. మంగు జగన్నాథం కవిగారి, వేంకటకవిగారి కలాపాలలోని దరువులను కూచిపూడివారు ప్రదర్శిస్తున్నారు.

తూర్పు ప్రాంతాలలో వంకాయల బలరామభుక్త, బ్రహ్మం కుటుంబాల వారు, ఇంకా ఇతరులు తమ సొంత కలాప రచనలను ప్రదర్శిస్తున్నారు ఆదిలో తూర్పు, కూచిపూడి మేళాలు రెండు పురుష మేళాలే.

ఉభయ గోదావరి జిల్లాలలో ప్రదర్శిస్తూండిన నవ జనార్దన పారిజాతం వివిధ కవులు వ్రాసిన దరువుల సంకలనం. ఈ కవులు వారి స్వస్థలాలలో వెలిసిన దేవతలకు అంకితంగా ఈ దరువులను వ్రాశారు. నెల్లిమర్ల, రంగపురి, కలువాయి, కోరుకొండ, ద్వారకాపురి, దువ్వ మొదలైన గ్రామాలలో వెలిసిన వివిధ కృష్ణ రూపాలకు అంకితంగా ఈ కవులు వ్రాశారు. ఈ సంకలనం చాలా పెద్దది. ఇది తొమ్మిది రాత్రిళ్ళు ప్రదర్శించడానికి వీలయివ గ్రంథం. అందుకే దీనికి నవ జనార్దనం అన్న పేరు రావడానికి ఒక కారణం. అయితే, ఈ జిల్లాలలోని స్త్రీ కళాకారులు 9రాత్రులు ఈ నవ జనార్దనాన్ని ప్రదర్శించారో లేదో గాని కొన్ని ప్రాంతాలలో కొందరు ప్రదర్శించినట్టు తెలుస్తూంది.

రాయలసీమలోని 'పారిజాత కళ' అంతరించిపోయిందని చెప్పవచ్చును. ఈ ప్రాంతంలో 'తవ' అనే ఒక నాట్యాన్ని స్త్రీలు ప్రదర్శిస్తూ ఉండేవారు. అది కూడా అంతరించిపోయింది. బనగానపల్లి నవాబులు ఈ కళలను పోషించారు. కోటకొండ కవ్రటాల అనే గ్రామంలో ఈ పారిజాతాన్ని ప్రదర్శించిన కళాకారులు పూర్వం ఉండేవారు. నేడు అక్కడ కూడా ఈ కళాకారులు లేరు.

షేక్ వెల్లాల లక్ష్మీకాంతమ్మ అనే ఒక నాట్య కళాకారిణి సుమారు 100 సంవత్సరాల క్రితం ప్రొద్దుటూరులో ఉండేది. అయితే, ఆమె కాలం నాటికే ఈ పారిజాత విద్య అదృశ్యమైనట్లు తెలుస్తూంది. ఆమె కర్ణాటక కచ్చేరీలు చేసేదని అక్కడివారు చెప్పారు.

ఈ ప్రదర్శనం కృష్ణసత్యభామల ప్రణయ కలహంతో ప్రారంభమౌతుంది. కృష్ణుడు అలిగి సత్యాదేవి మందిరాన్ని విడిచి వెళ్తాడు. అలా అలిగి

వెళ్ళిన తన పతిని వెదుక్కొంటూ ఆమె వచ్చే ఘట్టంతో ప్రదర్శన ప్రారంభ మౌతుంది. మొదట కలహం, తర్వాత అలుక, కృష్ణుని కొరకు అన్వేషణ-ఈ విధంగా దశావస్థలను చిత్రించే ఘట్టాలు అష్టవిధ నాయికల అవస్థలు ప్రదర్శింపబడతాయి. చివరికి దూతికా రాయబారం, మన్మథోపాలంబన, చంద్రోపాలంబన ఋతువర్ణన, ద్వితీయ మూర్ఛ ప్రదర్శింపబడి కృష్ణ సందర్శనంతో ప్రదర్శన ముగుస్తుంది.

ఈ పారిజాత నర్తనాన్ని సంపూర్ణంగా అభ్యసించినవారికి దరువు విన్యాసం, తాళలయల విన్యాసం, నాయికా ప్రకరణం, రసప్రకరణం ఏ యంశం మరి మిగలకుండా అవగతమౌతాయి. అందువల్ల కళాకారులు ఈ కలాపాన్ని క్షుణ్ణంగా సాధనచేయవలసి యుంటుంది. ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్వికాభినయాలను వీరు సంపూర్ణంగా తెలిసికొని అభ్యసించవలసి యుంటుంది.

"భామనే సత్యభామనే, వయ్యారి సత్యభామనే" అనే మంగువారి దరువును గాని, ''భామా యని పిలుతురే వయ్యారి సత్యభామా యని పిలుతురే'' అనే నెల్లిమర్ల వారి దరువును గాని తెరలో పాడిన తర్వాత భామ వేషధారి తెరవెడలి, ''దధిమదనా నీవు రావయ్యా" అనే దరువుతోగాని "అదిగో చంద్రుడు ఉదయం బాయెను" అనే దరువుతోగాని ఆట ప్రారంభిస్తుంది.

ఆ తర్వాత వివిధ నాయికావస్థలు, దశావస్థలు, వెన్నెల పదాలు ప్రదర్శింపబడతాయి. పిఠాపురం వారి పద్ధతిలో శ్రీకృష్ణుని బాల్యమంతా చందమామ దరువులో 9 చరణాలలో వర్ణింపబడినందువలన చందమామ దరువులు చాలా ముఖ్యమైనవి.

ఆ తర్వాత కృష్ణ సందర్శనంలో—

"బంగారుపువ్వుల నిన్ను
పూజసేతురా సామి
శృంగారించి కన్నులార
చూతునురా స్వామి
చెంగల్వ పూదండలు
మెడనిండ వేతురా
రంగపురి వెంకటేశ
రారా మాయింటిదాక" ఈ దరువుతో కథ ముగుస్తుంది.

చివరకు "ముత్యాల హారతులు ముదితలు మీరివ్వరమ్మా" అనే మంగళహారతితో ప్రదర్శన ముగుస్తుంది.

# డిప్లొమా - రెండవ సంవత్సరం ప్రాయోగికం

**I. నట్టువాంగం**

(అ) జతులు చెప్పడం

(ఆ) ప్రదర్శనలలో గేయానుసారంగా తాళం తట్టడం.

**II. నవజనార్థనం - బాలికలకు :**

(అ) మదనా - (దరువు మదనా-ఓ మదనా అబలలానూ వేచాదగునా)

(ఆ) రాయబారం దరువు - రాయబారము గొనిపోమ్మా.

(ఇ) ఖండిత నాయిక దరువు - జడతో కొట్టాక మానను.

(ఈ) చందమామ దరువు-చందమామా,చందమామా ఓ చందమామా.

**III. పేరిణి - బాలురకు :**

పల్లవి జతులు

శివతాండవానికి సంబంధించిన నృత్త, నృత్య అంశాలు.

**రిఫరెన్స్ పుస్తకాలు :**

1. దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర - రచయిత డా॥ నటరాజ రామకృష్ణగారు
2. నవ జనార్ధన పారిజాతము ,, ,, ,,
3. పేరిణీ శివతాండవము ,, ,, ,,
4. భరత శాస్త్రము: ప్రశ్నలు-జవాబులు ,, ,, ,,
5. నాట్యశాస్త్రము - డా॥ P. S. R. అప్పారావుగారు
6. అభినయ దర్పణం - నందికేశుడు

